A GUIDE TO

# PRATIMA NATAKAMU

(TELUGU DRAMA)

2

*Intermediate Examination, 1954*
*Madras University.*

BY

THIMMAVAJJHALA KODANDARAMAIAH

*Lecturer in Telugu,*

SIR THEAGARAYA COLLEGE, MADRAS.

AYA PUBLICATIONS
MADRAS-21.

# ప్రతిమానాటకము

[సమీక్ష]

మదరాసు యూనివర్సిటీ యింటర్మీడియేటు పరీక్ష
(1954) పఠనీయగ్రంథము

తిమ్మావజ్ఝల కోదండరామయ్య
ఆంధ్రోపన్యాసకుడు,
సర్ త్యాగరాయ కళాశాల, మదరాసు.

త్యాగరాయ పబ్లికేషన్సు
మదరాసు-21.



మూల్యము
ఒకరూపాయ

SIR THEAGARAYA COLLEGE,
MADRAS

20th JULY 1953.

Mr. T. Kodandaramaiah brings out his Guide to "**Prathima Natakamu**" under the auspices of the Theagaraya Publications. The hallmark of these publications is **Quality**. Mr. Kodandaramaiah's notes serve not only as a guide to students of Telugu Drama but will also be a source of inspiration to them in their understanding and appreciation of the art of drama. He brings to bear on his publication his erudite knowledge of Telugu literature and an unrivalled teaching experience. It is the aim of the Theagaraya Publications to bring out only books of approved merit and undoubted scholarship. Naturally, Mr. Kodandaramaiah's guide falls into line with these. We are sure that Telugu students appearing for the Intermediate Examination of the Madras University in March 1954 will find the guide immensely useful and also a a stimulant to them in their search for the higher reaches of knowledge in Telugu literature.

**M. K. Shanmugam,**
*General Editor.*

# మనవి

సంస్కృతనాటకప్రపంచమున భాసనాటకచక్రము హృదయంగమ మగుపాత్రోన్మీలనములో నొప్పారుచు నిసర్గసుందరమై చెలువారుచుండును. భాసనాటకములలోఁ బ్రతిమ యప్రతిమాన మయినది. విశ్వవిద్యాలయ పరీక్షలకుఁ బోవువిద్యార్థులకుఁ బాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁబడిన యీ 'ప్రతిమానాటకము'నకు సవిమర్శక మగుసమీక్ష యిందనుక వెలయలేదు. పరీక్షార్థు లగువిద్యార్థులకు సహాయకారిగా నుండవలయు నని యుద్దేశించి యీ 'సమీక్ష'ను వ్రాసి యిప్పుడు ప్రచురించుచుంటిని. పరీక్షలయందుఁ దోడ్పడుటతోఁబాటు విద్యార్థులలో విమర్శజ్ఞానమునుగూడఁ బెంపొందింపఁ జేయవలయు నని నా యుద్దేశము. తత్ప్రయత్నమున నే నెంతవఱకుఁ గృతార్థుఁడ నయితినో చెప్పుటకు సహృదయు లగుపండితవర్యులు ప్రమాణము! కళాశాలాధ్యాపకులును, విద్యార్థులును నా యీ ప్రయత్నము నందుఁ బ్రోత్సాహము గలిగింతు రని విశ్వసింతును.

ఈ సమీక్షను 'త్యాగరాయప్రచురణము'లలో నొక ప్రచురణముగా వెలయించుట కంగీకరించి నాపరిశ్రమమున కొక స్వరూపము గల్గించుటకుఁ దోడ్పడిన మా కళాశాలాధ్యక్షులు శ్రీ యమ్. కె. షణ్ముగం యమ్. ఏ. యల్. టి. గారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. దీని నిట్లు సర్వాంగసుందరముగా నచ్చొత్తించి యిచ్చిన 'వెల్డన్‌ప్రెస్సు' వారి నభినందించుచున్నాఁడను.

తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

# ప్రతిమానాటకము



## భాసమహాకవి

'భారవి కుంతలాళి శివభద్రుఁడు
క్రమ్మడి భాసుఁ డందలం
కారము కాళిదాసుఁడు వికాసము
మాఘుఁడు కర్ణపూర మ
క్రూరచరిత్రుఁడై పరఁగుకొమ్మయ
తిక్కఁడు దర్పణంబు సం
సారసుఖైక వాక్ప్రచుర చారు
వచస్సరసీరుహాక్షికిన్'—

అజ్ఞాతకవి యెవ్వఁడో తిక్కయజ్వ కవితయందు భారవి కాళిదాసాది మహాకవుల కవితా మార్గములు దర్పణమునందుఁబోలెఁ దోఁచుచుండు నని తదీయప్రశంసగాఁ జెప్పిన యొకానొక చాటుపద్య మిది భాసకవి కవితామూర్తికిని నొక మధురనీరాజన మగుచున్నది. భాసుఁడు 'సంసారసుఖైకవాక్ప్రచురచారువచస్సరసీరుహాక్షి'యగుసరస్వతి క్రమ్మడి యందలి యలంకార మఁట! ఏమి సొగసైన వర్ణనము! ఎంత మధురమైనభావము! జయదేవకవి ప్రసన్నరాఘవములో

'భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ'

అని కవితాకామిని హాసముగా భాసుని దర్శించినాఁడు!

భాసుఁడు మహాకవి! ప్రతిభామూర్తి! కళాతపస్వి! మధుమయ భణితికి వాల్మీకియట్లు సామాజికహృదయంగమదృశ్యకావ్యరచనాచాతురికి

నితఁడు మార్గదర్శి. సంస్కృతమున నలంకారశాస్త్ర గ్రంథములు, లక్షణ గ్రంథములు రసస్వరూపమును వినిపింపఁగా నితని స్వప్నవాసవదత్తము రసస్వరూపమును గనిపించినది! రూపకప్రపంచమునందే యది యొక యద్వితీయసృష్టి! భాసకృతులకు సహజత, శైలీప్రసన్నత, హృద్యత యనునవి ప్రత్యేకగుణములు. అందువలననే

'భాషాసు రమ్యా గైర్వాణీ తస్యాం కావ్యం మనోహరమ్
తత్రాపి రూపకం రమ్యం తత్ర భాసకవేః కృతిః'

అని— భాషలలో సంస్కృతమును, నందుఁ గావ్యమును, నందు మరల రూపకమును, వానఁ దిరిగి భాసకవికృతియు రమ్యము లని భాసకృతి రామణీయకము కొనియాడఁబడుచున్నది.

ఇతని కృతి యగు ప్రతిమానాటకమును సవిమర్శముగాఁ బరిశీలించుటకు ముం దితనిగూర్చియు, నితని కృతులను గూర్చియు నేర్పడిన వివాదముల (The Bhasa Problem) యొక్క స్వరూపమునుగూర్చి యొకింత తెలిసికొందము.

## భాసమహాకవిసమస్య

## (The Bhasa Problem)

క్రీ. శ. 1910 సంవత్సరప్రాంతమున మహామహోపాధ్యాయ, కావ్యకంఠ, శ్రీ టి. గణపతిశాస్త్రిగారు తిరువనంతపురమున భాసమహాకవి కృతులుగాఁ బదుమూఁడు రూపకముల గుఱుతించి వానిఁ బ్రకటించు దాఁకఁ బరిశోధకులకును బండితులకును సారస్వతములో నచ్చటచ్చటఁ గానిపించు ప్రస్తావముల మూలమున మాత్రమే భాసకవి విషయము తెలిసియుండెను. కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో

'ప్రథితయశసాం భాస సౌమిల్ల కవిపుత్రాదీనాం
ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య
క్రియాయాం కథం బహుమానః'

(ప్రథితయశస్కు లయిన భాస సౌమిల్ల కవిపుత్రాదుల ప్రబంధముల నతిక్రమించి వర్తమానకవి యగుకాళిదాసు కృతియం దేల బహుమానము చూపుదువు) అని సౌమిల్ల కవిపుత్రులతోఁబాటు భాసునిఁ గూడఁ బేర్కొనినాఁడు. సూత్రధార కృతారంభములుగను, బహుభూమికములుగను నితఁడు పలునాటకములు రచించినట్లు బాణమహాకవి పేర్కొనెను. వీరు గాక యాలంకారికులు పలువు రీతని స్వప్నవాసవదత్తమును బేర్కొనిరి. అందు ముఖ్యముగా వాక్పతి, రాజశేఖరుఁడు, అభినవగుప్తుఁడు, భోజుఁడు, శారదాతనయుఁడు, సాగరనంది మొదలగువారు పేర్కొనఁ దగుదురు.

భాసునిచే రచింపఁబడినవిగాఁ జెప్పఁబడు పదుమూఁడు రూపకములను బ్రధానముగా మూఁడుదెఱఁగుల విభాగింపవచ్చును. ౧. పురాణమూలికములు (Epic); ౨. బృహత్కథా మూలికములు (Epic legendary); ౩. కల్పితములు (Original) నని

1. పురాణమూలికములు (Epic)

## రామాయణము

౧. ప్రతిమానాటకము
౨. అభిషేకనాటకము

## మహాభారతము

౩. పంచరాత్రము
౪. మధ్యమవ్యాయోగము
౫. బాలచరితము
౬. దూతవాక్యము
౭. దూతఘటోత్కచము
౮. కర్ణభారము
౯. ఊరుభంగము

2. బృహత్కథామూలికములు (Epic legendary)

౧౦. ప్రతిజ్ఞాయౌగంధరాయణము

౧౧. స్వప్నవాసవదత్తము

3. కల్పితములు (Original)

౧౨. అవిమారకము

౧౩. చారుదత్తము.

వీనినే మఱికొందఱు రామాయణ రూపకములు, మహాభారత రూపకములు, ఉదయన రూపకములు, కల్పిత రూపకములు నని నాలుగు తెఱఁగుల విభాగము గావించిరి.

ఇవి ప్రకటింపఁబడిన పిదప నివి భాస రచిత నాటకములే కావనియు, వీనిలోఁ గొన్నిమాత్రమే భాసరచితములు, తక్కినవి కావనియు, రెండు తెఱఁగు లయిన వాదములఁ జేపట్టి విమర్శకలోక మీ విషయమున గొప్ప చర్చ సాగించినది. కాని నేఁటికిని నీ సమస్య పరిష్కరింపఁబడకయే నిలిచియున్నది. ఈ పదుమూఁడు నాటకములును నేకకర్తృకములే యనుటకు సాధనములుగాఁ బ్రధానముగా నీ క్రింది సామాన్యలక్షణములు పేర్కొనఁబడినవి.

1. ఈ రూపకము లన్నిటియందును నాటకము 'నాంద్యంతంబున సూత్రధారుఁడు ప్రవేశించి' యను సూచనతోఁ బ్రారంభ మగుచున్నది.

2. నాటకముఖమునఁ గావింపఁబడుప్రస్తావన (Prologue) యీతని రూపకములలో స్థాపన యని పేర్కొనఁబడినది.

3. స్థాపనలు మిక్కిలి చిన్నవిగా నుండి సంస్కృత నాటకములలో వీనియందు సామాన్యముగాఁ గానవచ్చు కవినామాదికప్రశంసయుఁ గృతి ప్రశంసయు లేక యున్నవి.

4. ఈ రూపకములలోఁ బెక్కింటియందలి నాందీశ్లోకమున ముద్రాలంకారరూపమున రూపకమునందలి ప్రధానపాత్రముల నామధేయములు సామాజికులకుఁ దెలుపఁబడుచున్నవి.

5. ఎల్ల రూపకములయందును భరతవాక్య మొకేరీతిని నున్నది.

కాని యీ సామాన్య లక్షణములును ప్రతిపక్షవాదులచేతఁ బూర్వపక్షము సేయఁబడినవి. తొలి రెండు విషయములును కేరళదేశమునందలి తక్కిన సంస్కృత నాటకములయందును గానవచ్చుచున్న వనియుఁ, గనుక నివి యన్నియు నేకకర్తృకములే యనుటకుఁ బ్రత్యేకగుణములుగాఁ జేకొనఁబడుటకు వీలులే దనియు వా రందురు. కేరళదేశపు నట్టువకాండ్రు రంగస్థలప్రయోజ్యములుగా నుండుటకై వీనిని మార్చుకొనుటచేఁ దక్కినశిల్ప సామ్యము (Structural Similarities) ఏర్పడి యుండ వచ్చు ననియు వారివాదము. భాసుఁడు రచించిన నాటకములనే రంగప్రయోగార్హములుగా నుండునట్లు కేరళదేశపు నట్టువకాండ్రు కుదించి వ్రాసికొని రనియు, నివి వా రట్లు వ్రాయించుకొనిన నాటకము లనియు, భాసరచితము లయిన మూలనాటకములు మనకు లభింపవలసియున్న వనియు, నవి యివి కా వనియు మఱికొందఱి యభిప్రాయము.

ఈ రూపకము లన్నిట రచనాశిల్ప మొకేరీతిగా నున్నది. రంగస్థలమునఁ జూపరాని వని యాలంకారికులచే నిషేధింపఁబడిన మరణము, యుద్ధము, నిద్ర, వస్త్రధారణము మొదలగునవి వీనిలో రంగస్థలముపైఁ బ్రదర్శింపఁబడినవి. పాణిని వ్యాకరణ నియమములు వీనిలోఁ బెక్కుస్థలముల నుల్లంఘింపఁబడినవి. కథాగమనము వేగముగా నుండుట (Rapidity of action) వీనియం దన్నిటఁ గానవచ్చుచున్నది. పదప్రయోగమునందును, శైలియందును వీనిలో సామ్యము చూపట్టుచున్నది. కొన్ని రూపకములలో నొక రూపకములోని వాక్యములు, శ్లోకములు నట్లట్లే మఱొకరూపకమున స్వీకరింపఁ బడినవి. ఈ యంశము లన్నియు నీ రూపకము లేకకర్తృకము లనుటను నిరూపించుచున్నవి. కాని వీని నాకాలమున రంగస్థలముపైఁ బ్రయోగించుచుండిన కేరళదేశపు నట్టువులే సాధారణముగా నిట్టి సామ్యము లేర్పడుటకుఁ గారకు లనియు మనము తలఁచుట కవకాశము లేకపోలేదు. కనుక నివి యేకకర్తృకము లనుటకు నింకను

ప్రామాణికము లగు నాధారములు లభింపవలసియే యున్నవి. అందువలఁ
దాత్కాలికముగా నివి భాసరచితము లయినరూపకము లనియే యంగీక
రించుట సమంజసము. తెలుఁగున భాసనాటకములు పలువురిచే సంస్కృ
తమునుండి యనువదింపఁ బడినవి. వా రెల్లరు నివి భాసరచితము లనియే
విశ్వసించిరి.

## దేశకాలములు

అపూర్వశిల్పసమన్వితము లయినరూపకములను రచియించి రూపక
ప్రపంచమునం దద్వితీయఖ్యాతి గడించిన యీ మహాకవి దేశకాలములు
వివాదగ్రస్తము లయి నేఁటికిని సందిగ్ధములుగా నుండుట యెంతయు శోచనీ
యము! విమర్శకులు కొంద ఱితఁడు కేరళదేశీయుఁ డనియు, నితని నివాస
స్థలము కేరళదేశ మనియుఁ బేర్కొనిరి. మఱికొంద ఱితఁ డుజ్జయినీప్రాంతము
వాఁ డని తలఁచిరి. ఇతఁ డుజ్జయినీ ప్రాంతమువాఁ డనుటయే సమంజస మని
పలువుర యభిప్రాయము. తన రూపకములం దెచ్చటను నితఁడు తన్నుఁ
గూర్చి యేమియుఁ జెప్పికొని యుండలేదు. అందుచే నితని దేశకాలములు
ప్రకారాంతరములచే నూహింపఁబడవలసిన వయ్యెను. ఇతని కాలమును
గూర్చి పలువురు పలుతెఱఁగులఁ జర్చలు సలిపి యుండిరి. కాని యసందిగ్ధ
ముగా నితనికాలము నేఁటివఱకు నిశ్చయింపఁబడకయే యున్నది.

కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో భాసునిఁ బేర్కొనుటచే
నితఁడు కాళిదాసుకంటెఁ బూర్వుఁ డని స్పష్టము. గుణాఢ్యుఁడు
విరచించిన బృహత్కథలోని యుదయనకథ నాధారముగాఁ గొని యితఁడు
తన ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము ననురూపకములను
రచించుటచే నితఁడు గుణాఢ్యునకుఁ దరువాతివాఁ డగుట తెల్లము. కనుక
స్థూలముగా నితఁడు కాళిదాసుకంటెఁ బూర్వుఁ డనియు, గుణాఢ్యునికిఁ
దరువాతివాఁ డనియుఁ దెలియనగుచున్నది. కాళిదాసు కాలముగూడ
సందిగ్ధముగానే యుండుటచే దాని నాధారముగాఁ గొన్న భాసకాల

నిర్ణయమును సంశయగ్రస్తమే కాఁగలదు. కాని కాళిదాసు క్రీ. పూ. 56 సంవత్సరప్రాంతమువాఁ డని పలువుర యభిప్రాయము. గుణాఢ్యుఁడు క్రీ. పూ. అయిదవ శతాబ్దివాఁ డగుటచే కాళిదాస గుణాఢ్యులకు మధ్య కాలములో నున్న భాసుఁడు క్రీ. పూ. మూఁడవ శతాబ్దివాఁడుగాఁ దలంపఁ బడుచున్నాఁడు.

వస్తువునందు మాత్రమేగాక కవితాశైలియందును బురాణ గ్రంథముల ప్రభావ మీతని రూపకములందుఁ గానవచ్చుచుండుటచే భాసుఁడు చాల ప్రాచీనుఁ డగు మహాకవి యనుట స్పష్టము కాఁగలదు. ఇతని చారిత్రక రూపకములయందు ఉదయనుఁడు, ప్రద్యోతుఁడు, దర్శకుడు నను చారిత్రకపురుషులు (Historical figures) పేర్కొనఁబడిరి. కాని వారినిగుఱించి సయితము నిశ్చయముగా నేమియుఁ దెలియవచ్చుటలేదు. క్రీ. పూ. ఆఱవశతాబ్దికిఁ దరువాతివారు కారని మాత్రము తెలియుచున్నది. ప్రతిమలో నితఁడు బృహస్పతి యర్థశాస్త్రమును బేర్కొని కౌటిల్యునిఁ బేర్కొనక పోవుటచే నితఁడు కౌటిల్యునికంటెఁ బూర్వుఁ డని యనఁగా క్రీ. పూ. అయిదవ శతాబ్దము వాఁ డని కొందఱి యభిప్రాయము.

ఇట్లు భాసుఁడు కాళిదాసునకంటెఁ బూర్వుఁ డనుటను మించి యితని కాలమును గూర్చి నిశ్చయముగా నిస్సంశయముగాఁ జెప్పుటకు వీలులేకున్న దనియే చెప్పవలసియున్నది.

## నామౌచిత్యము

### (The Title of the play)

భాసమహాకవి రచితములుగాఁ జెప్పఁబడుచున్న పదుమూఁడు రూపకములలో రామాయణ కథేతివృత్తమును బ్రతిపాదించునవి ప్రతిమయు, నభిషేకమును. భాసుని యప్రతిమ కల్పనాసామర్థ్యమునకును, బ్రాతిభ నిర్మితి రచనమునకును బ్రతిమ పెట్టినది పేరు! రససిద్ధి నిర్వాహణమున స్వప్నవాసవదత్తమునకుఁ దరువాత నీ ప్రతిమయే యప్రతిమానమై వెలయుచున్న దనుట యతిశయోక్తి కాఁజాలదు. ప్రథమాంకమున వల్కల

కల్పనము, తృతీయాంకమున దశరథ ప్రతిమాకల్పనము, పంచమాంకమున దశరథశ్రాద్ధకల్పనము నను సరిక్రొత్త విషయములతోఁ గాళిదాసాదులును ననుకరింపఁదగిన భావస్ఫూర్తులతోఁ బ్రేక్షకుల మనసులకు గిలిగింత పెట్టఁ గల ప్రశస్తనాటక మిది! ఇట్టి ప్రశస్తి నందిన యీ ప్రతిమానాటకము యొక్క నామౌచిత్యమునుగూర్చి యించుక ముచ్చటింతము.

కథాశరీరనిర్మాణమునందుఁ బ్రధానభూమిక వహించుచున్న దశరథ ప్రతిమనుబట్టి యీ నాటకమునకుఁ బ్రతిమానాటక మని పేరు వచ్చినది. సంస్కృతనాటకములలో సాధారణముగాఁ బ్రస్తావనమునందు నాటక మునుగూర్చియుఁ దద్రచయితనుగూర్చియుఁ బ్రస్తావ ముండుట సంప్రదాయము. కాని యిందలి ప్రస్తావనలో నట్టి ప్రస్తావ మేదియుఁ గానరాదు. ప్రతిమానాటక మని యీపే రొకానొక తాళపత్రములో నీ నాటక మునకుఁ గడపట నున్న గద్యమునుబట్టి యేతన్నాటకమును దొలుత వెలుఁగులోనికిఁ దెచ్చిన మహాపండితుఁడు మహామహోపాధ్యాయ శ్రీ టి. గణపతిశాస్త్రిగారు పెట్టినది. మఱియు నిందలి నాందీశ్లోకములోని 'యత్ర ప్రతిమమతి' యను విశేషణముకూడ నీ నాటకమునకు భాసుఁడు 'ప్రతిమా నాటక'మనియే పేరు పెట్టియుండు నని సూచించుచున్నది.

తృతీయాంకమున భరతుఁడు ప్రతిమాగృహమున నుండఁగా దశరథ మరణవృత్తాంత మతనికిఁ దెలియును. భరతుఁడు చాల నాళ్లనుండి తన మేనమామగారియింట నుండెను. తన జనకుఁడు దశరథమహారాజస్వస్థశరీరుఁడుగా నుండె నని తెలిసి యతఁ డయోధ్యకు రథారూఢుఁడై యరు దెంచుచుండెను. అయోధ్యానగరము బహిఃప్రదేశము నతఁడు చేరుసరికి రాజగురువులు వసిష్ఠులవారు 'కృత్తికానక్షత్ర మింక నొక్కగడియ గలదు. కావున నీ గడియ గడచి రోహిణీనక్షత్రము వచ్చిన తరువాతనే నగర ప్రవేశము చేయవచ్చును' అని భరతునికి వార్త పంపిరి. ఊరిబయటఁ గొంత విశ్రాంతిగొని నగరములలోఁ బ్రవేశించుట పెద్దల యాచార మని యాతఁ డచట నా గడియసేపు విశ్రమింపఁ దలఁచును. అచ్చటి ప్రతిమాగృహము నొకదేవళ మని యెంచి యాతఁడు విశ్రాంతియు దేవపూజయు రెండును గలిసి

వచ్చు నని యందుఁ బ్రవేశించును. ప్రతిమాగృహమున స్థాపితము లయి యుండిన యిక్ష్వాకుల ప్రతిమలను గాంచి యాతఁ డవి దైవతప్రతిమ లని నమస్కరింపఁబోవఁగా నచటి రక్షకుఁడు దేవకులికుఁ డతని వారించును. విగతజీవుల ప్రతిమలను మాత్రమే ప్రతిమాగృహమున నిలుపుదు రని దేవకులికునివలనఁ దెలిసికొని యచట నుండిన దశరథప్రతిమను గాంచి భరతుఁ డాందోళన మందును. దశరథ మరణవృత్తాంతమును ముఖాముఖిని గాక మార్గాంతరమున నెఱిఁగిన భరతుఁడు వివరములఁ దెలుపు మని దేవకులికునిఁ దొందరించును. శ్రీరామచంద్రుఁడు వనవాసమున కేఁగుటయుఁ, బుత్రవియోగవ్యథచే దశరథుఁ డసువులఁ బాయుటయు, నీ దుస్థితికిఁ గారణమగు తన తల్లియగు కైకేయి దుశ్చింతయు భరతుఁడు దేవకులికునివలనఁ దెలిసికొని కైకేయిని గర్హించుచుఁ దనసోదరుఁ డగు శ్రీరామచంద్రునకై దయనీయముగాఁ బరితపించును. తనతల్లి యగు కైకేయి దుశ్చింతకుఁ బ్రతిక్రియగా భరతుఁడు తనతల్లి ప్రయత్నమునఁ దనకుఁ బ్రాప్తించిన రాజ్యాభిషేకమును తిరస్కరించి శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి యాతని నయోధ్యకుఁ దెచ్చుటకై సుమంత్రునితోడను బ్రకృతులతోడను వనముల కేఁగును.

శ్రీరామచంద్రుని రాజ్యాభిషేక మీ నాటకమున నపేక్షిత ప్రధాన ఫలము. తత్ఫలప్రాప్తికిఁ గలదొడ్డయడ్డంకులలో నొకటి యగు భరత రాజ్యాభిషేకము జరగక పోవుటకీ దశరథ ప్రతిమాకల్పనమే ప్రధాన కారణ మగుచున్నది. ఈ నాటకమున నిది యొక ప్రధానఘట్టము. కథాగమనమును మఱొక బాటకుఁ దార్చు కీలకస్థాన మిది! కైకేయి స్వార్థపరతవలన శ్రీరామచంద్రుని రాజ్యాభిషేక మాగిపోయినది. అది చాలక యతనికిఁ బదునాలుగేండ్లు వనవాసముకూడ విధింపఁబడినది. రాజ్యాభిషేకమునకు భరతుఁ డుత్తరాధికారి యయ్యెను. కనుక శ్రీరామపట్టాభిషేకము జరుగుట కెట్టి యవకాశమును లేదు. తన యాజ్ఞ నుపసంహరించుకొని శ్రీరామపట్టాభిషేకమునకై యాజ్ఞాపించుటకును దశరథుఁడు సజీవుఁడు కాఁడు. అతఁడు మృతుఁ డయ్యెను. ఇట్టి క్లిష్టపరిస్థితిలో భరతుఁడు తన జనకుఁ డగు దశరథుని మరణవృత్తాంతమును, నందులకుఁ గారణభూత మగు

దన తల్లి కైకేయి దుశ్చింతను దెలిసికొనును. రాజ్యాభిషేకము నంగీకరింప కుండుటకై యాతఁడు కావించుకొనిన సముచితనిర్ణయమును, శ్రీరామ చంద్రునిఁ బ్రార్థించి యాతనిఁ దిరిగి యయోధ్యకుఁ గొనితేరవలయు నని సంకల్పించిన యాతని సంకల్పమును శ్రీరామరాజ్యాభిషేక మను నాటకఫల ప్రాప్తికిఁ గల రెండు ప్రధానాటంకములను దొలఁగించుచున్నది. ప్రతిమా గృహమున జరగిన యీవృత్తి మిట్లు నాటకమునందుఁ బ్రాధాన్యము గలిగి వెలయుచున్నది. ఇందుచేతనే ప్రతిమానాటక మని యీ నాటకమున కిడినపే రెంతయు న్యాయసమ్మతమును, సముచితమును నని తలఁపఁదగి యున్నది. ఇందలి ప్రతిమాగృహావృత్తాంతము భాసుని స్వకపోలకల్పిత మయి, సరసమై, మనోహర మయి వెలయుచుండుటయే గాక నాటకము నకు శీర్షభూతముగా నుండి సమర్థనీయ మగుచున్నది.

కాలే మహాశయుఁ డీ ప్రతిమాగృహాకల్పన మంత సరసముగా లేదని యభిప్రాయపడి యేతద్ఘట్టమును నిశితముగా విమర్శించియున్నాఁడు. భరతుఁడు ప్రతిమాగృహమును దేవాలయముగాఁ దలఁచి యందుఁ బ్రవే శించినాఁ డనుటచే నతఁ డచటి ప్రతిమాగృహము నెన్నఁడును జూచి యుండలే దని తెలియుచున్నది. ఇది యంత సహజముగా విశ్వాస్యముగా లేదని కాలే పండితుని యభిప్రాయము. కాని భరతుఁడు "చాలనాళ్ళు నుండి తన మేనమామగారి యింట నుండెను." "అయోధ్యలోని వార్త లేవియు నాతనికిఁ దెలియ వయ్యెను." 'మహారాజులుంగారు మిక్కిలి యస్వస్థశరీరులుగా నున్నా రని'—యతని రాజ్యాభిషిక్తునిఁ గావించు టకై సుమంత్రాదులు కబురు పంపఁగా నది విని యాతఁడు వచ్చుచుండెను. ఇందుచే భరతుఁడు చాలనాళ్లనుండి - కొన్ని సంవత్సరములే కూడ - నయోధ్యానగరమున లేఁ డని తెలియవచ్చుచున్నది. దశరథుఁడు భరతుఁ డయోధ్యలో లేని యా కాలమున నా ప్రతిమాగృహమును నెలకొలిపి యుండవచ్చును. దశరథ మరణానంతర మాతని ప్రతిమయు నందు నిలుపఁ బడియుండఁ దగును. ఇట కాలేమహాశయుఁడు "దశరథ మరణానంతరము

పదునైదుదినముల వ్యవధిలో నంత శీఘ్రముగా దశరథప్రతిమ ప్రతిమాగృహమున నెలకొలుపఁబడియుండుట యెట్లు విశ్వాస్య మగు''నని ప్రశ్నించెను. కాని నాటకమునం దెచ్చటను దశరథుని మరణ దివసమునకును, భరతుని యయోధ్యానగరాగమన దివసమునకును మధ్యకాలము పదునైదు దినములే యని నిశ్చయముగాఁ జెప్పఁదగిన ప్రామాణికాధారము లేవియుఁ గానరావు. ఆ మధ్యకాల మంత కింకను నెక్కువగాఁ గూడ నుండవచ్చును. కథాగమనమున నీ ఘట్టమునకుఁ బ్రత్యేకప్రాముఖ్య మెన్నఁ దగిన దేదియు లేదని యా పండితుని యభిప్రాయము. కాని యది నాటకమున నొక కీలక ఘట్ట మగుట యింతకు మునుపు సకారణముగా నిరూపింపఁబడినది గదా!

ప్రొఫెసరు ధ్రువ యనుపండితుఁ డీ నాటకమునకు 'ప్రతిమాదశరథ' మనునది పేరయి యుండు నని తలఁచుచున్నాఁడు. కాని యందులకు నిర్ణాయక మగు తాళపత్రగ్రంథాధార మేదియు మనకు లభించుట లేదు.

దేవధరుఁ డను మఱియొక విమర్శక విద్వాంసుఁడు ప్రతిమానాటక మనుటను మఱొకవిధముగా వ్యాఖ్యానించినాఁడు. "ఈ నాటకమున భరతుఁడు దశరథునికిని, శ్రీరామచంద్రునకును నచ్చును ప్రతిమగాఁ-ప్రతివిగ్రహముగాఁ- జిత్రింపఁబడియున్నాఁడు. దేవకులికుఁడు, సుమంత్రుఁడు, లక్ష్మణుఁడు, సీత మొదలగువా రందుచేతనే నాటకమునఁ బలుతావుల భరతుని దశరథ శ్రీరామచంద్రులుగాఁ బొరఁబడుట తటస్థించినది''— ఇది యావిద్వాంసుని యభిప్రాయము.

ఇందుఁ దొలుతఁ గావింపఁబడిన సమర్థనమే సరస మనియు, సమంజస మనియుఁ దోఁచు ననుటలో సందేహము లేదు.

## మూలము

### (The source of the play)

ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము నని వస్తువు మూఁడువిధము లగుచున్నది. భారత రామాయణాది ప్రసిద్ధ మగుకథ ప్రఖ్యాత మనియు

స్వకపోలకల్పితకథ యుత్పాద్య మనియు, నీ రెండును గలిసినది మిశ్ర మనియుఁ జెప్పఁబడును. వీనికిఁ గ్రమముగా మహావీరచరిత్రము, మాలతీ మాధవము, ఉత్తరరామచరితము ననునవి యుదాహరణములు.

ప్రస్తుతప్రశంసలో నున్న ప్రతిమానాటకమున వస్తువు మిశ్రము. భాసమహాకవి తన యీ నాటకమునకు వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణమునుండి వస్తువును బరిగ్రహించినను నాటకమున రససిద్ధికొఱకును, ప్రయోగానుకూలత చేకూర్చుటకును 'అన్యథా వా ప్రకల్పయేత్' అను న్యాయముఁబట్టి ప్రధానేతివృత్తముతో స్వకపోలకల్పితము లగురసవత్తర కల్పనముల మేళవించి యద్భుతముగా నాటకవస్తువును దీర్చినాఁడు. కాఁగా భాసుని యీ ప్రతిమానాటకమునకు వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణము మూల మని యెన్నఁదగియున్నది. అందును బ్రధానముగా నయోధ్యారణ్యకాండములయందలి యితివృత్తమే యిందుఁ బరిగృహీతము. రామాయణకథేతివృత్తము గల యితని మఱొక నాటక మగు 'నభిషేకము'నందు రామాయణములోని కిష్కింధ, సుందర, యుద్ధకాండముల యితివృత్తము ప్రధానముగా స్వీకరింపఁ బడినది. కాఁగా నితని రామాయణ రూపకములు రెండును నొకదాని కొకటి పూరకము (Supplement) లనుట సత్యదూరము కాదు.

## కథానిర్మాణము

## (The Plot Construction)

ప్రతిమయందు శ్రీరామచంద్రుఁడు రాజ్యాభిషిక్తుఁ డగుట యుద్దిష్ట ఫలము. నాటకమునందలి యెల్ల సంభవములును దదంత్య ఫలాగమ ప్రాప్తికిఁ దార్చునవిగా రమణీయముగాఁ జిత్రింపఁబడియుండుట యెన్నఁదగిన విషయము. దశరథమహారాజు తనకు జరాదోషంబు ప్రాప్తించుకతన శ్రీరామచంద్రుని రాజ్యాభిషిక్తునిఁ జేయ నిశ్చయించును. శ్రీరామచంద్రునికి రాజ్యాభిషేకము జరుగవలసిన దినమునాఁటి కథతో నాటక

మారంభ మగుచున్నది. కాని తద్రాజ్యాభిషేకమునకు నొకటివెంబడి నొకటిగా నాటంకము లేర్పడును. రాజ్యాభిషేకమునకై సర్వమును సిద్ధ మయ్యెను. రాజ్యాభిషేకమును జరుగనుండెను.

'తోడరి యభిషేకఘటము శత్రుఘ్న లక్ష్మ
ణులు గొనిరి; గొడ్గు ఱేఁడు గోదిలుచుఁ గొనియెఁ;
దొట్రిలుచు ఱేనిచెవిలో నెదో వచించె
నంత మంథర; రాజు గానైతి నేను'

మంథర మహారాజులుంగారి చెవిలో నెదో వచించుటచేత శ్రీరామచంద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడు కాఁడయ్యెను. పిదపఁ గైకేయి వివాహకాలమునఁ దనకు మహారాజు వాగ్దానము గావించిన శుల్కమునకై భరతుఁడు రాజ్యాభిషిక్తుఁడు కావలయు ననియు, శ్రీరామచంద్రుఁడు పదునాలుగేండ్లు రాజధాని వీడి యరణ్యవాసము సేయవలయు ననియుఁ గోరును. ఇందుచే శ్రీరామచంద్రుఁడు రాజ్యపట్టాభిషిక్తుఁడు గాఁదగిన యవకాశమే దూర మయినది. గీఁదుమిక్కిలి శ్రీరామచంద్రున కరణ్యములో నేదేనిఁ గీడు మూడుటయు సంభావ్యమే యగును. శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యముల కేఁగును. పుత్రవియోగవ్యథచే దశరథమహారాజులుంగారు మరణించుటయు లక్షితఫలాగమప్రాప్తికి నెట్టి యవకాశమును లేకుండఁజేసెను. ఇట్లు మాతులగృహమునుండి భరతుఁ డయోధ్య కేతెంచునాఁటికిఁ బరిస్థితు లన్నియు విషమించియుండెను. నాటకమున నీఘట్టమున నొక యుచ్చదశ (Climax) - గర్భసంధి- యేర్పడినది. శ్రీరామపట్టాభిషేకమునకు బొత్తిగా నవకాశమే లేదయ్యెను.

కాని ప్రతిమాగృహమునఁ దనజనకుఁ డగు దశరథమహారాజ ప్రతిమను గాంచిన పిదప దేవకులికునివలన నెల్లవిషయములను దెలిసికొని భరతుఁడు తనతల్లి దుష్టప్రయత్నమును గర్హించి తనకుఁ బ్రాప్తించిన రాజ్యాభిషేకాధికారమును దిరస్కరించును. భరతుని స్వీయధర్మచింతనము వలనను, దనసోదరుఁ డగుశ్రీరామచంద్రునిమీఁది యతని యనిర్వచనీయ

స్నేహమువలనను నతనికి జరగవలసిన రాజ్యాభిషేక మాగిపోయినది. తన తల్లి దుష్టప్రయత్నమునకుఁ బ్రతిక్రియగా భరతుఁడు శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి తిరిగి యాతని నయోధ్యకుఁ దెచ్చుటకై యరణ్యమున కేఁగును. కాని శ్రీరామచంద్రుఁడు పితృవాక్యపరిపాలనమున దృఢనిశ్చయుఁడు. భరతుని ప్రార్థనము నతఁడు కాదనవలసి వచ్చెను. కాని కైకేయి పెట్టిన గడువు పదునాలుగేండ్లును గడచినపిదప నయోధ్యకు మరలి వచ్చి రాజ్యాధికారమును స్వీకరింతు నని శ్రీరామచంద్రుఁడు భరతునికి వాగ్దానము చేసెను. ఇట్లు కాలవ్యవధాన మనునొక్క కొఱఁత దప్ప ఫలాగమము కనుచూపు మేరలోనే యుండున దగుట గోచరము కాఁగలగు.

ఇంతలో నొక క్రొత్త యవాంతరము వచ్చి పడినది. అది సీతాపహార వృత్తాంతము. కాని యీ యవాంతరముకూడఁ దొలఁగు విధానము పంచమాంకమున నించుక సూచితము. ఇందు శ్రీరామచంద్రుఁడు వానర చమూపతి యగు సుగ్రీవుని మైత్రీసహాయములఁ బడసెను. ఇది కాక రావణుఁడు సీత నపహరించుకొని పోయె నను వృత్తాంతమును విని భరతుఁడును రావణునిమీఁదికి నయోధ్యనుండి యొక గొప్పసైన్యమును బంపియుండెను. మఱియు నీ యంకముననే లక్షితఫలాగమప్రాప్తికిఁ గల మఱొక యాటంకమును దొలఁగిపోయినది. శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకుఁ గైకేయి విముఖురా లనువిషయ మయథార్థ మని యిందుఁ దెలిసినది. కైకేయి యింతకుఁ బూర్వము రాజ్యాభిషేకమునకు నాటంకము గలుగఁ జేయుట లోకక్షేమ ప్రయోజనము నర్థించియే యనియు నిందుఁ దెలియ వచ్చినది. ఇట్లు శ్రీరామచంద్రుఁడు రావణవధానంతరము సీతాలక్ష్మణులతో నయోధ్యకుఁ దిరిగి వచ్చునాఁటికి నెల్లయాటంకములును దొలఁగిపోయినవి. సర్వప్రజయు నతనికి హృదయపూర్వక మయినస్వాగతము నొసఁగినది. శ్రీరామచంద్రుఁడు రాజమిత్రబంధుజనసమక్షమున నయోధ్యలో మహావైభవముతో రాజ్యాభిషిక్తుఁ డయ్యెను. లక్షితఫలాగము మిట్లు నాటకాంతమునఁ బ్రాప్తించినది.

# మూలమునకు భిన్నము లయినకూర్పులు - నాటకమున వాని ప్రయోజనములు

## (Deviations from the Ramayana and their Dramatic importance)

ప్రతిమ కథావస్తువును శ్రీమద్రామాయణమునుండియే పరిగ్రహించినను భాసమహాకవి నాటకోచిత కథానిర్మాణమునకై స్వకపోల కల్పితములగు నూతనకల్పనముల నెన్నిటినో తననాటకమునఁ బ్రవేశపెట్టియున్నాఁడు. మూలమునకు భిన్నముగాఁ జేయఁబడిన యీకూర్పు లనేకములు నాటకోచితములుగా నుండుటయే గాక యది ప్రదర్శనయోగ్యముగా నుండుటకును దోడ్పడుచున్నవి. మూలమునకు భిన్నముగాఁ జేయఁబడిన ప్రధానములయిన కూర్పులును, వాని ప్రయోజనములును నిటఁ బేర్కొనఁబడుచున్నవి.

1. ప్రథమాంకమున వల్కలకల్పన మొకమనోహర మయిన సన్నివేశము. ఏతదంకమున శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకదినము విచిత్రముగాఁ గైకేయి స్వార్థపరతవలన నతని వనవాసారంభ దినముగాఁ బరిణమించినది. అందుచేతనే బాగుండునో, బాగుండదో చూతమని ముచ్చటకై సీత కట్టుకొనిన నారచీరలు వనవాసమునకుఁ దాల్పవలసిన యవశ్యచిహ్నములుగాఁ బరిణమించినవి. ఈ వల్కల వృత్తాంతము నాటకోచిత మగు యుత్సవదినము విచారదినముగా మారుటలోఁ గల క్రమపరిణామదశను దెల్లము సేయుచున్నది.

2. తృతీయాంకమున నభివర్ణింపఁబడిన ప్రతిమాగృహవృత్తాంతము భాసుని యపూర్వ సృష్టి! నాటకమున నీవృత్తాంతమునకుఁ గల ప్రాధాన్యమునుబట్టి యది నాటకమునకే పేరగుటకూడ సంభవించినది. దశరథమహారాజులుంగారు స్వస్థశరీరులుగా నున్నారని విని మాతులగృహమునుండి యయోధ్యకరుదెంచుచుండిన భరతుఁడు నగరి వెలుపల నున్న ప్రతిమాగృహమును బ్రవేశించి యందు దశరథప్రతిమను గాంచి యాతని మరణ

వృత్తాంతము తెలియును. ఈ యంకమున దశరథుని రాణుల ప్రవేశము మిక్కిలి సహజముగా నుండునట్లు నేర్పుతోఁ గావింపఁబడినది. అయోధ్య యం దడుగుకూడ మోపక భరతుఁడు సరాసరి యరణ్యముల కేఁగును.

౩. పంచమాంకమున సీతాపహారవిధానము భాసుని ప్రాతిభకల్పనా సామర్థ్యమున కొక నిదర్శనము! రావణుఁడు పరివ్రాజక వేషమున సీతారాము లున్నయెడకు వచ్చును. రామాయణములో వలె సీతముచ్చట దీర్చుటకై కాక జనకుని యనుసంవత్సరశ్రాద్ధవిధి నుచితగతిని నిర్వర్తించుటకై శ్రీరామచంద్రుఁడు కాంచనపార్శ్వ మృగమును వేఁటాడఁ బోవును. తీర్థయాత్రనుండి తిరిగి వచ్చుచుండిన మునికులపతి నెదురుకొని కొనితెచ్చుటకై లక్ష్మణుఁ డేఁగియుండుటచే నతఁ డక్కడ లేఁ డయ్యెను. శ్రీరామచంద్రుఁడు పరివ్రాజక వేషమున నున్న రావణునికడ సీతను విడనాడి కాంచనపార్శ్వమృగము నంటి పోవును. సీతాపహారము రావణునకు సులు వయ్యెను. మూలమునకు భిన్నముగాఁ జేయఁబడిన యీ కూర్పు శ్రీరామచంద్రునియొక్కయు, సీతాదేవియొక్కయు శీలములను వన్నె దెచ్చుచున్నది. శ్రీరామచంద్రునికి దశరథునిపైఁ గల యపారభక్తియే కాంచనపార్శ్వమృగమును వేఁటాడ నతనిఁ బ్రోత్సహించినది. సీతముచ్చట దీర్చుట కాతఁ డా కార్యమును జేయలేదు. ఇందుచే రామాయణమున నొకింత డింకుపఱుపఁబడిన శ్రీరామచంద్రుని శీల మిట నతని యపార పితృభక్తి కారణముగా మహోన్నతదశ నంది వెలుఁగొందుచున్నది. రామాయణములో వలె సీత లక్ష్మణునిగూర్చి నిందావాక్యము లాడు సందర్భమును నిందుఁ దొలఁగినది. సీత శీలమున కుదాత్తత యిందుఁ జేకూడినది.

4. రామాదుల యోగక్షేమముల నరసి వచ్చుటకై భరతుఁడు సుమంత్రుని నరణ్యములకుఁ బంపును. మఱియు సీతాపహార వృత్తాంతమును విని యతఁ డయోధ్యనుండి రావణునిమీఁదికి గొప్పసైన్యమును బంపును. మూలమునకు భిన్నములుగా నున్న యీరెండు విషయములును భరతుని యుదాత్తశీలమునకు వన్నె వెట్టుచున్నవి.

5. విధిచేతి యుపకరణముగా మాత్రమే కైకేయిని జిత్రించి భాసుఁడామె శీలమునకు వన్నె దెచ్చినాఁడు. రాజ్యలోభముచే నామె శ్రీరామచంద్రు నడవులకుఁ బంపలేదు. తప్పించుకోరాని మహర్షిశాపమును బ్రవర్తింపఁజేయుటకే యామె శ్రీరాముని వనవాసమును గోరినది. బుద్ధిపూర్వకముగాఁ గాక యాబెడదలో నామెమనసు చెదరిపోవుటచే నామె నోటఁ బారి పదునాలుగునాళ్ళకుఁ బదునాలుగేళ్ళనినది. ఈ కారణ మెంత సహజముగను, సమాధానీయముగను లేకపోయినను కైకేయీవృత్తమును రామాయణములోవలె నీచముగాఁ గాక మహోదాత్తముగాఁ జిత్రింపవలె నన్న భాసునిలక్ష్యము మాత్ర మిందుఁ దెల్లమగుచున్నది.

6. అయోధ్యనుండి కౌసల్యాదులు, భరతుఁడు, శత్రుఘ్నుఁడు, సుమంత్రుఁడు మొదలగు ప్రకృతులు విచ్చేయుచుండఁగా వారి సమక్షమున నరణ్యములో శ్రీరామచంద్రునకుఁ బట్టాభిషేకము జరుగుటయు, సపరివారముగా శ్రీరామచంద్రుఁడు పుష్పకారూఢుఁడై యయోధ్య కేతెంచుటయు నాటకోచితప్రభావ (Dramatic effect) సముత్పాదనమునకై భాసుఁడు కావించిననూతనకల్పనములు.

7. ద్వితీయాంకమున మరణశయ్యపై నున్నదశరథునకు దిలీపాదుల దర్శనము కలిగినట్లు చిత్రించుటయు నాటకోచితప్రభావ సముత్పాదనమున కనియే తలఁపఁదగియున్నది.

8. లక్ష్మణుఁ డిం దంతటను భరతున కగ్రజుఁడుగాఁ జిత్రింపఁబడి యుండుట గమనార్హమయినవిషయము. మఱియు దశరథుని వంశక్రమ మిందు దిలీపుఁడు, రఘువు, నజుఁడు, దశరథుఁడు ననుక్రమమునఁ జెప్పఁబడియున్నది. కాళిదాసమహాకవి రఘువంశమునను నీక్రమమే పాటింపఁబడియున్నది. ఈరెండు సందర్భములయందును భాసుఁడు రామాయణమును గాక పద్మపురాణమును ననుసరించినట్లు తోఁచుచున్నది.

9. ప్రథమాంకమున శ్రీరామచంద్రునకుఁ బట్టాభిషేకప్రయత్నము జరుగుచున్న యవసరమున శత్రుఘ్నుఁడును నయోధ్యయందే యుండినట్లు

తెలుపఁబడియున్నది. రామాయణమున నతఁడు భరతునితో నతని మాతుల గృహమునకుఁ గేకయదేశమునకుఁ బోయి యుండినట్లు తెలుపఁబడియున్నది. ప్రతిమాగృహమున భరతుఁ డొక్కఁడే యుండుటకు వీలుగా నీమార్పు గావింపఁబడినది.

10. కొన్ని సంభవములు జరిగినకాలము విషయమునను మూలమునకు భిన్నము లయినమార్పు లిందుఁ గాననగును. రామాయణమున శ్రీరామ చంద్రుఁడు పండ్రెండేండ్లు వనవాసము సలిపినపిదప సీతాపహరణము జరిగి నట్లు వర్ణింపఁబడి యుండఁగా నిందు దశరథుని యనుసంవత్సర శ్రాద్ధ దివసమునకుఁ బూర్వదివసమున నది జరిగినట్లు వర్ణింపఁబడినది.

నాటక కథావస్తు నిర్మాణమునందు భాసుఁడు గావించిన పయి కల్పనము లీ నాటకములోని విశేషభాగము రామాయణమూలకమే యని యనఁదగియున్నను కొంతవఱకు భాసుని సృజనశక్తి (Creative faculty మూలక మనియుఁ గొప్పగ కొంతయుఁ దోడ్పడుచున్నది. మూలమునకు భిన్నముగా నిందుఁ జేయఁబడిన ప్రధానము లయినమార్పులు నాటకోచిత ప్రభావ సముత్పాదనమునకో లేక నాటకమునందలి పాత్రముల శీలముల నుదాత్తముగాఁ జిత్రించుటకునో గావింపఁబడి యుండుట గమనార్హ మయినవిషయము.

## కాలవిమర్శము

### (Time-Analysis)

ప్రతిమానాటకమునం దున్న యేడంకములలోన ఐదునాలుగేండ్ల కాలవ్యవధిలో జరిగినరామాయణకథ యభివర్ణింపఁబడి యున్నది. స్థాపనలో సూత్రధారుఁడు శరత్కాలమునుగూర్చి ప్రస్తావించుటచేత శ్రీరామ చంద్రుని పట్టాభిషేకము శరత్కాలమునందు జరుగ నుండె నని తెలియు చున్నది. పట్టాభిషేక మే దివసమున జరుగు నటుల నిశ్చయింపఁబడెనో యా దివసముననే శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యముల కేఁగును.

ద్వితీయాంకమున దశరథమరణవృత్తాంతము తెలుపఁ బడినది. దశరథమహారాజు మంత్రి యగు సుమంత్రుఁడు శృంగిబేరపురమున శ్రీరామచంద్రుని, సీతా లక్ష్మణులను వదలిపెట్టి తిరిగి యయోధ్య చేరిననాఁడు దశరథుఁడు మరణించును. కనుక ప్రథమాంకమునకును, ద్వితీయాంకమునకును మధ్య నధమపక్షము రెండుమూఁడు దినముల కాలవ్యవధాన మయినను నుండి యుండు నని యంగీకరింప వలసి యున్నది.

తృతీయాంకమున భరతుఁడు మాతులగృహమునుండి యయోధ్యకు మరలి వచ్చుచు నుపాధ్యాయుఁ డగువసిష్ఠమహర్షి పంపినసందేశముచొప్పున నగరబాహ్యప్రదేశమున నొక కొంతకాలము విశ్రమించును. వసిష్ఠుఁడు చెప్పి పంపినమాటలనుబట్టి యా నాఁడు కృత్తికానక్షత్ర మని తెలియుచున్నది. రామాయణమున శ్రీరామ పట్టాభిషేకము 'పుష్య' నక్షత్రము నాఁడు జరుగునటుల నిశ్చయింపఁబడిన దని తెలియవచ్చుచున్నది. దీనినిబట్టి భరతుఁడు శ్రీరామచంద్రుఁ డరణ్యముల కేఁగిన పిదప నిరువదిమూఁడు దినములకు మాతులగృహమునుండి యయోధ్యకు మరలి వచ్చె ననియు దశరథుఁడు మరణించి యప్పటికించుమించుగా నిరువదిదినము లయి యుండు ననియు నూహింప నగుచున్నది. కాని యప్పటికే ప్రతిమాగృహమునందు స్వర్గస్థుఁ డయినదశరథమహారాజులుంగారి ప్రతిమయు నెలకొల్పఁబడె ననుటచే ద్వితీయతృతీయాంకములకు నడుమ నధమపక్షము రెండు నెలల కాలవ్యవధాన మయినను నుండఁదగు ననిపించుచున్నది.

తృతీయచతుర్థాంకములకు మధ్య నున్న కాలవ్యవధాన మత్యల్పము. భరతుఁ డయోధ్యనుండి ప్రయాణమై చిత్రకూటము చేరునాఁటికి కెన్ని దినములు పట్టునో యన్నిదినముల వ్యవధాన మా రెండంకములకును నడుమ నుండు నని యూహించుట యసమంజసము కాదు.

పంచమాంకమున దశరథుని యనుసంవత్సర శ్రాద్ధవిధి యామఱునాఁడు జరగవలసి యుండినట్లు స్పష్టముగాఁ దెలుపఁబడియున్నది.

సీతాపహారము దశరథుని యనుసంవత్సర శ్రాద్ధదివసమునకుఁ బూర్వదివసము నాఁడు సాయంకాలము జరగినది.

పంచమాంకషష్ఠాంకములకు మధ్య నున్నవిష్కంభము లోనికథ పంచమాంకకథ జరగినవెంటనే యా దినముననే జరగినది. షష్ఠాంకములోని కథావృత్తాంత మాపిదపఁ జాలనాళ్ళకు సంబంధించినది. అందు సుమంత్రుని మాటలను బట్టి సీతాపహరణము జరిగినపిదప శ్రీరామచంద్రుఁడు చిత్రకూటమును వీడి సీత నన్వేషించుచుఁ గిష్కింధ చేరె ననియు, నచట సుగ్రీవునితోడి మైత్రి సంపాదించి యతని సోదరుఁ డగువాలిని సంహరించి సుగ్రీవుఁడు కోలుపోయిన రాజ్యమును, సతిని దిరుగ నతనికి లభింపఁజేసె ననియుఁ దెలియుచున్నది. కనుక షష్ఠాంకప్రారంభమున నున్న విష్కంభమునకును, షష్ఠాంకమునకును మధ్య నున్న కాలవ్యవధాన మెంతో స్పష్టముగాఁ జెప్పుటకు వీలులేదు. కొన్ని సంవత్సరముల వ్యవధాన ముండు ననుట మాత్రము సత్యము.

సప్తమాంకమున శ్రీరామచంద్రుఁడు రావణుని సంహరించి యయోధ్యకు మరలి వచ్చుచుండును. ఇప్పటికిఁ గైకేయి తనవరములలోఁ జేర్కొనిన పదునాలుగేండ్లును పూర్తి యయినవి. కనుక షష్ఠాంక సప్తమాంకముల మధ్య గూడఁ గొన్ని సంవత్సరములు గతించి యుండు నని యూహింపఁదగును. తుదకు సప్తమాంకమున శ్రీరామపట్టాభిషేకము మహావైభవముగా మునిజనసమక్షమున జరగును.

ఇట్లు ప్రతిమానాటకమున నాటకకథాగమనమునకుఁ (Action of the play) బదునాలుగేండ్ల కాలవ్యవధానము పట్టినది.

## స్థలనిర్దేశము

### (The place of action)

ప్రథమ, ద్వితీయ, షష్ఠాంకములందలి కథ యయోధ్యలో రాజాంతఃపురమునను, ద్వితీయాంకకథ యయోధ్యా నగర బాహ్యప్రదేశమున నున్న

ప్రతిమాగృహమునను, చతుర్థ, పంచమ, సప్తమాంకములయందలి కథ దండకారణ్యమునందలి జనస్థానమునందును జరుగును. షష్ఠాంక ప్రారంభమున నున్న విష్కంభము కూడ జనస్థానమునందే జరుగును.

## రసనిర్ణయము

### (The main sentiment in the play)

నాటకములలో శృంగారవీరములలో నేదేని అంగి (ప్రధాన) రసముగాను, దక్కిన రసము లంగములుగాను నుండఁదగు నని యాలంకారికుల నిర్ణయము. ప్రతిమానాటకమున వీరరసము అంగి. వీరము - ధర్మవీరము, దయావీరము, యుద్ధవీరము నని ముత్తెఱఁగులు. ఇందుఁ బ్రధానముగా ధర్మవీరరసము మహోదాత్తముగా నిర్వహింపఁ బడినది.

మహామహోపాధ్యాయ శ్రీ గణపతిశాస్త్రిగారు ప్రతిమానాటకము నందు కరుణరస సమ్మిశ్రిత మయిన ధర్మవీరము అంగిరసముగాఁ బ్రతిపాదింపఁ బడిన దని భావించుచున్నారు. శ్రీరాముఁ డిందుఁ దనకు జనకుఁడును, మహారాజును నగు దశరథుని వాక్య పరిపాలనము అను ధర్మమును మహోదాత్తముగా నిర్వర్తించును. కనుక నిందు ధర్మవీరము అంగిరస మగు నని వారి యభిప్రాయము.

మఱికొందఱు విమర్శకవిద్వాంసులు ప్రతిమానాటకము నందలి ప్రధానరసము కరుణరస మని యభిప్రాయపడుచున్నారు. వారిలో ప్రొఫెసరు ధ్రువ, డాక్టరు పుసల్కరు అనువారు ప్రధానులు. కాని వారివాదము సహేతుకముగాఁ జూపట్టుట లేదు. ద్వితీయాంకమున శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యముల కేఁగిన పిదపఁ బుత్రవియోగము నోర్వఁజాలక దశరథుఁడు నిర్వేదము నొందుటలోఁ గరుణరసస్ఫూర్తి విశేషముగాఁ దోఁచుచున్నను నది యంగిరస మగు 'వీర'మున కంగరసముగాఁ బేర్కొనఁ దగినదే యగును గాని యంగిరసము మాత్రము కాఁజాలదు.

శ్రీరామచంద్రుఁ డిందు నాయకుఁడు. అతఁడు జనకుని వాక్యము నిర్వర్తించుటకై మాఱుమాటాడక రాజ్యమును విడనాడి యరణ్యముల

కేఁగును. శుల్కమందుఁ బల్కఁ బడినవాక్యమును దన జనకుఁ డగు దశరథునిచే నిర్వర్తింపఁ జేసి శ్రీరామచంద్రుఁడు తండ్రియెడలఁ బుత్త్రుఁ డాచరింపఁదగిన ధర్మమును నిర్వర్తించును. కనుక నిందు ధర్మవీరమే యంగిరస మని యంగీకరింపవలసి యున్నది.

అంగిరస మగుధర్మవీరమున కంగములుగాఁ గొన్ని యితరరసములును నిందుఁ బ్రతిపాదింపఁ బడినవి. శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యముల కేఁగినపిదపఁ బుత్రవియోగము నోర్వఁజాలక దశరథుఁడు విలపించుటలోను, నరణ్యమున శ్రీరామసుమంత్రుల సమాగమమునను గరుణరసము నిర్వహింపఁబడినది. తృతీయాంక ప్రారంభమున నున్నవిష్కంభములో హాస్యరస మించు కంతగా గోచరించుచున్నది. జటాయురావణ యుద్ధవర్ణనమున యుద్ధవీరము కలదు.

# కథాసంగ్రహము - విమర్శము

## (The argument of the Play)

## ప్రథమాంకము

ఏతదంకప్రారంభమునఁ బ్రతీహారి యగువిజయ ప్రవేశించి కాంచుకీయునిఁ బిలిచి దశరథ మహారాజులుంగారు శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకై యభిషేకసంభారముల శీఘ్రముగా నాయత్తపఱుప వలసినదిగా నాజ్ఞాపించె నని యతనితోఁ జెప్పును. అతఁడును మహారాజునాజ్ఞ నేరకు సర్వమును సిద్ధపఱుపఁ బడిన దని తెలుపును. పిదప ప్రతీహారి సంభవకుఁ డనునొక పరిచారకుని బిలిచి పురోహితులకడకుఁ బోయి వారిని దొందరపెట్టు మని చెప్పును. సారసిక యనుచెలిని బిలిచి సంగీతశాలకుఁ బోయి పట్టాభిషేకసందర్భమున సమయానుగుణ మయిన నాటక మాడుటకు సన్నద్ధులు గావలసినదిగా నాటకులతో విన్నవింపు మని చెప్పును. పిదప సర్వమును సిద్ధ మయిన దని మహారాజుగారితో మనవి చేసికొనుటకుఁ దానును వెళ్లును.

ఏతద్ఘట్టము దాని స్వరూపలక్షణములను బట్టి విష్కంభ మని చెప్పఁ దగియున్నది. కాని నాటకమున నిది విష్కంభ మని పేర్కొనఁబడి యుండలేదు.

పిదప సీత చెలికత్తెలలో నొకతె యగునవదాతిక ప్రవేశించును. నాటకరంగాలంకారములను జాగ్రత్తపఱుచు రేవమ్మగారి నవదాతిక 'పని తీరిపోయినవి. అశోకపు చిగురుటాకులు ఉంచేను నా కిమ్మని యడిగినది. ఆమె 'వల్లకా' దనెను. అందుచే నామె 'పని పట్టించుటకై యవదాతిక నవ్వుటాల కని' సంగీతశాలనుండి యొక నారచీరను దొంగలించుకొని వచ్చెను. అపుడు సీత చెలికత్తెలతో నరుదెంచి యవదాతిక ముఖకవళికలను బట్టి యామె యేదో యపరాధము చేసి యుండు నని గుఱుతించి, యామె నడిగి విషయము తెలిసికొని 'తప్పుపని చేసినావు. పోయి యిచ్చి రా' యని యామెను మందలించును. ఆమెయు రేవమ్మగారి కిచ్చి వచ్చుటకై పోవుచు నా నారచీరను బయలుగాఁ బట్టుకొని పోవుచుండును. అపుడు సీత యా నారచీరను జూచి దానిని గట్టుకొనవలె నని కుతూహలపడి యవదాతిక నడిగి తీసికొని 'ఏమో బాగుంటుందో బాగుండదో చూతా' మని తాను ధరించును. ఒక చేటి పోయి యద్దము తీసికొని వచ్చును. ఆమె యద్దమును సీత కిచ్చి రాచనగరలో పట్టాభిషేక ప్రయత్నములు జరుగుచున్న వని తెలుపును. ఇంతలో మఱొక చేటి ప్రవేశించి శ్రీరామచంద్రుఁడు రాజ్యపట్టాభిషిక్తుఁడు కాఁబోవుచున్నాఁడను శుభవర్తమానమును వినిపించును. ఆపలుకు విని సీత 'దశరథుఁడు క్షేమముగా నున్నాఁడా' యని ప్రశ్నించును. చేటి దశరథుఁడే స్వయముగా శ్రీరామచంద్రునికిఁ బట్టము కట్టుచున్నాఁ డని తెలుపును. సీత 'రెండు శుభవార్తలు విన్నాను. పెద్దగా ఒడిపట్టు' అని చేటికి బహుమానముగాఁ దన శరీరముపై నున్న నగల నూడఁదీసి యిచ్చును. ఇంతలో నగారా మ్రోఁత వారికి వినిపించును. అది గట్టిగా కణకణ మ్రోఁగి పిదప నంతలోనే నిలిచిపోయెను. 'రాజస్థానములు బహు గడబిడలతో నుంటవి' గనుక శ్రీరాముని రాజ్యాభిషేకమున కేదేని యడ్డంకి వచ్చి యుండు నని సీత భావించును.

పిదప శ్రీరామచంద్రుఁడు ప్రవేశించి కైకేయి చెలికత్తె యగు మంథర 'నోనిచెవిలో నేదో వచించుట' చేతఁ దన రాజ్యపట్టాభిషేక

మాగిపోయిన దని సీతకుఁ దెలుపును. సీతారాము లిరువురును బట్టాభిషేక మాగిపోవుటచే దశరథుఁడే మహారాజుగా నుండు ననియు, రాజ్యభారము మోయవలసినపని తప్పిన దనియు మిక్కిలిగా సంతోషింతురు. పిదప శ్రీరామచంద్రుఁడు సీత ధరించియున్న నారచీరను గుర్తించి దాని నేల ధరించితి వని సీతను బ్రశ్నించును. అవదాతిక 'ఏమో బాగుంటుందో బాగుండదో చూతా మని ముచ్చటకుఁ గట్టుకొన్నా రమ్మగారు' అని శ్రీరామునితోఁ జెప్పును. శ్రీరాముఁ డది యిక్ష్వాకువంశమువారి ముసలితనపు టలంకార మని తెలిసి యవి తనకును బ్రియము లగుటచే వానిని ధరింపఁ గోరును. సీత 'యభిషేకము తప్పిపోయిన మీ కిది యమంగళపుమాట యని నాకు శోచు మన్నది' యని యతని వారించును.

ఇంతలో తెరలోనుండి 'అయ్యో! అయ్యో! మహారాజులుంగారు!' అనుకలకలము వినవచ్చును. కాంచుకీయుఁ డొకఁడు ప్రవేశించి శ్రీరామచంద్రుని రాజ్యపట్టాభిషేక మాగిపోవుటకు హేతుభూతురా లయిన కైకేయి భరతుని రాజ్యపట్టాభిషిక్తునిగాఁ జేయవలసిన దని దశరథు నడిగ ననియు, దశరథుఁడు కైకేయిని వివాహ మాడునపు డారీతిని బలికియుండె ననియు, నందుచే 'నీప్పితమ్ము తనకు నదియేని కలదెమొ మూర్ఛలోఁ జేఁదు మునిఁగినాఁడు' అనియుఁ దెలుపును.

అంత లక్ష్మణుఁడు విల్లు నంబులఁ దాల్చి రంగముమీఁదికి వచ్చి శ్రీరామచంద్రుఁడు పదునాలుగేం డ్లరణ్యవాసము చేయవలయు నని కైకేయి దశరథునిఁ గోరె ననియు, నందుచే శ్రీరామచంద్రుఁ డరణ్యములకుఁ బోవలసియున్న దనియుఁ దెలిపి శ్రీరామచంద్రుఁ డనుజ్ఞ యిచ్చిన యెడల లోకమును దాడుఁబుర్వులను దుల్పుదు నని పలుకును. కాని శ్రీరామచంద్రుఁ డుద్రిక్తుఁడు గాక శాంతచిత్తుఁడై యుండి లక్ష్మణుని కోపము నుపశమిల్లఁజేయును. అతఁడు పితృవాక్యపరిపాలనమునకై యడవుల కేఁగ నిశ్చయించి రేవమ్మగారిచ్చిపంపిన నారచీరలను ధరించును. సీతయు శ్రీరామచంద్రుని వెంట నరణ్యముల కేఁగ నిశ్చయించును. సీత నాప్రయత్నమునుండి

విరమింపఁజేయవలసిన దని శ్రీరాముఁడు లక్ష్మణునిఁ గోరును. కాని లక్ష్మణుఁ
డందుల కంగీకరింపక సీత తనను గని ననుగమించుటయే ధర్మ మని నుడువును.
ఇంతలో నొకచేటి ప్రవేశించి సంగీతశాలాధికారిణి యగు దేవమ్మ నార
చీరలపై సీత ముచ్చటపడుట యెఱిఁగి యుపయోగపడునని యెంచియుఁ,
క్రొత్తవియు నగు నారచీరల నిచ్చి పంపె నని తెలుపును. శ్రీరామచంద్రుఁ
డానారచీరలను గైకొని ధరించెను. అప్పుడు లక్ష్మణుఁడు తానును
దనసోదరు నడుగుల ననుగమింపఁగోరి నారచీరలను దనకును నిమ్మని
ప్రార్థించును. శ్రీరామచంద్రుఁ డతని వారించుటకుఁ బ్రయత్నించును.
సీతయు నతని వారించుటకుఁ బ్రయత్నించును గాని లక్ష్మణుని చిత్తశుద్ధిని,
సోదరభక్తిని గాంచి ముగ్ధురాలై లక్ష్మణుఁడు గూడ దమ వెంట వచ్చుట
కనుమతింపవలసిన దని శ్రీరామచంద్రుని బ్రార్థించును. శ్రీరామచంద్రుఁడును
నందుల కంగీకరించి తాను గైకొనిన వల్కలములలో సగభాగమును లక్ష్మణున
కొసఁగును. సీతారామలక్ష్మణులు ముఖద్వారమున నరణ్యములకుఁ బ్రయాణ మగు
దురు. ప్రజ లెల్లరును బాగుగాఁ జూచుటకు వీలగునట్లు శ్రీరామచంద్రుఁడు
సీతను మేలిముసుఁగును దొలఁగింపవలసిన దని కోరును. ఆసమయమునఁ
గాంచుకీయుఁడు ప్రవేశించి సీతారామలక్ష్మణు లరణ్యముల కేఁగుచున్నా
రన్న విషయముఁ దెలిసి గుఱ్ఱాక్రాంతుఁడై దశరథుఁడు వారిని జూడవచ్చు
చున్నాఁ డని తెలుపును. కాని శ్రీరాముఁ డాసమయమునఁ దనజనకునిఁ
గలిసికొన కుండుటయే మంచి దని తలఁచి యతఁ డున్న వైపునకుఁ దిరిగి
నేలపై సాష్టాంగపడి నమస్కరించి సీతాలక్ష్మణులతో నరణ్యముల కేఁగును.

ఏతదంకమున వల్కలవృత్తాంతము మనోహరముగాఁ జిత్రింపఁబడి
సుందర మయిన యొక సన్నివేశమును (The irony of situation)
గల్పించుచున్నది. ఇందు శ్రీరామచంద్రుని పట్టాభిషేకదివస మతని
వనవాసగమన దివసముగాఁ బరిణమించుటలోఁ గలక్రమపరిణామము మనో
హరముగాఁ జిత్రింపఁబడియున్నది. సీత 'ఏమో బాగుంటుందో బాగుండదో
చూతా మని ముచ్చటకై' కట్టుకొన్న నారచీరలు వనవాసమున నవశ్యముఁ

దాల్పవలసిన తపస్విచిహ్నములుగాఁ బరిణమించుట చమత్కారముగాఁ గల్పింపఁబడి హృదయరంజక మగుచున్నది. ఇది గాక శ్రీరామచంద్రుని పట్టాభిషేకమును నిలుపుదల సేయవలయు ననియు, నతనిని బదునాలుగేం డ్లరణ్యముల నుండ మని యాజ్ఞాపింపవలయు ననియు, భరతునికి రాజ్య పట్టాభిషేకము చేయవలయు ననియుఁ గైకేయి దశరథు నడిగిన మూఁడు వరములను గ్రమముగా నాటకమునఁ బ్రవేశపెట్టఁబడి నాటకోచితప్రభావ (Dramatic effect) సముత్పాదనమున కొంతయుఁ దోడ్పడుచున్నవి.

## ద్వితీయాంకము.

ద్వితీయాంక ప్రారంభమున నున్నవిష్కంభములోఁ గాంచుకీయుఁడు సీతారామలక్ష్మణు లరణ్యములకు వెడలినపిదప వారివలని వియోగమున శోకవ్యాజాలక పలవించు చుండిన దశరథుని దయనీయస్థితి నభివర్ణించును. అంకప్రారంభమున దుఃఖావిష్టుఁ డయిన దశరథమహారాజు కౌసల్యాదు లగు రాణులచేఁ బరివేష్టితుఁడై ప్రవేశించును. దుఃఖావిష్టుఁడై మహారాజు సీతారామలక్ష్మణులఁ బ్రత్యేకము పేరు పేరుకొని పలవించుచు, నెలుఁగెత్తి విలపించు చున్న యీ ఘట్టము కరుణరసప్రధానమై దశరథుని దయ నీయస్థితిని గనులకుఁ గట్టునట్లు చిత్రించుచున్నది. కాని యంకాంతమున సుమంత్రుఁడు సీతారామలక్ష్మణుల నరణ్యముల దిగవిడిచి యయోధ్యకు వచ్చి రాజాంతఃపురము ప్రవేశించుదాఁక నిం దభినయమున కవకాశ మించుకంత తక్కువగా నుండి తత్కారణమున నుద్వేగజనకము గాకున్నది. అరణ్యముల నుండి వచ్చినసుమంత్రుని దశరథుఁడు సీతారామలక్ష్మణుల క్షేమవృత్తాంత మును బ్రత్యేకప్రత్యేకముగా వివరముగా నడిగి తెలిసికొని తుదకు మూర్ఛఁ జెందును. కౌసల్యయు, సుమంత్రుఁడును నతనిని మూర్ఛనుండి తేర్చుటకుఁ బ్రయత్నించియు విఫలు లగుదురు. దశరథుఁ డించుక తేరుకొని మీఁదికిఁ జూచి యచటఁ దన పితరులను గనుగొని శ్రీరామచంద్రుని, లక్ష్మణుని, సీతను నెలుఁగెత్తి పిలుచుచు మూర్ఛితుఁ డయి నేల వ్రాలును. ఇంతలోఁ

దెర వ్రాలఁగాఁ చెరలోనుండి యంతఃపురజనులయొక్క యార్తనాదము వినవచ్చును. ఈ దుఃఖదృశ్యము కరుణరస సముత్పాదకమై యలరారుచుఁ బ్రేక్షకుల హృదయములఁ గదలించుచున్నది. కాని యేతదంకము కథాశరీరనిర్మాణమున (The construction of the plot) కంతగా నుపకరించుట లేదనియే చెప్పవలసియున్నది.

## తృతీయాంకము

తృతీయాంకప్రారంభమున నున్నప్రవేశకము హాస్యరసజనకమై యుండి పూర్వాంకమునందలి దుఃఖాంతసన్నివేశమును జూచుటచే బరువెక్కిన ప్రేక్షకుల హృదయముల కొంత విశ్రాంతి చేకూర్చుచున్నది. ప్రతిమాగృహము నందు సుధాకారుఁడు తన కాజ్ఞాపింపఁబడిన కార్యము నెల్లను నిర్వర్తించి యొకింతసేపు విశ్రాంతి గైకొనఁ దలఁచి పరుండును. అపుడు ప్రతిమాగృహరక్షకుఁ డగు భటుఁ డొకఁ డరుగుదెంచి సుధాకారుఁడు తాను జెప్పిన పనిని జేసెనో లేదో యని తెలిసికొనకుండఁగనే యతనిని దన్నును. ఏతద్ఘట్టము భారతీయజీవితమును మనోహరముగాఁ జిత్రించుచు సహజరామణీయకముతో నొప్పారుచున్నది. ఇక్ష్వాకువంశ్యులగుమహారాజుల ప్రతిమలు నెలకొల్పఁబడియున్న యీ ప్రతిమాగృహమునకు దశరథుని రాణు లగు కౌసల్యాదులు కొంతకాలమునకు మునుపే క్రొత్తగా నెలకొలుపఁబడిన దశరథప్రతిమను దర్శించుట కై వచ్చుచున్నా రనువృత్తాంతమునుగూడ నీ ప్రవేశకము ప్రేక్షకులకుఁ దెలుపుచున్నది.

మాతులగృహమునుండి యయోధ్యకు రథారూఢుఁడై యరుదెంచుచుండిన భరతుని ప్రవేశముతోఁ దృతీయాంకము ప్రారంభ మగుచున్నది. అతఁడు మేనమామగారి యింటఁ జాలనాళ్ళనుండి యుండుటచే నతని కయోధ్యలోని వార్త లేవియుఁ దెలియవయ్యెను. అతనికి దశరథ మరణవృత్తాంతమావంతయుఁ దెలియదు. మహారాజులుంగారు మిక్కిలి యస్వస్థశరీరులుగా నున్నారని విని యతఁ డయోధ్య కరుదెంచుచుండెను. అతఁడు దశరథుని

పరిస్థితినిగూర్చి సూతుని బ్రశ్నించును. కాని యతఁడు దశరథమరణ వృత్తాంతమును మఱుఁగుపఱిచి చెప్పియుఁ జెప్పనట్లుగా నతనికి సమాధాన మొసఁగును. భరతుఁ డతనిపలుకులలోని యాథార్థ్యమును గలిసికొనఁజాలఁ డయ్యెను. తన తలిదండ్రులను, సోదరులను గలిసికొన నతని హృదయము వేగిరపడుచుండెను. అతఁ డయోధ్యానగర బాహ్యప్రదేశముఁ జేరవచ్చు సరి కొక భటుఁ డరుదెంచి రోహిణీ నక్షత్రము వచ్చినతరువాత నగర ప్రవేశము చేయవలసిన దని యుపాధ్యాయుఁ డతనికిఁ జెప్పి పంపిన సందేశమును దెలుపును. వసిష్ఠులవారి సందేశముమేరకు భరతుఁడు తన రథము నాపి యాపరిసరములఁ గొంతసేపు విశ్రమింపఁ దలఁచును. అంత నాతఁడు చెట్లచాటునఁ గనుపట్టుచున్న ప్రతిమాగృహము నొక దేవాలయ మని తలపోసి దేవపూజయు, విశ్రాంతియుఁ గలిసివచ్చు నని యా ప్రతిమాగృహము వైపునకుఁ బోవును. ప్రతిమాగృహము బాగుగా నలంకరింపఁబడియుండెను. అతఁ డా యలంకారమును గాంచి యచ్చట నేదేని యుత్సవవిశేషము జరుగనుండె నేమో యని తలఁచును. అతఁ డంతఁ బ్రతిమాగృహములోనికిఁ బ్రవేశించి భావవ్యక్తితో శిల్పసౌందర్య ముట్టిపడుచు దైవతోద్దిష్టము లయినను మానుషవిశ్వాసమును గలిగించుచుండిన నాలుగు ప్రతిమలను గాంచును. అతఁ డవి దైవతప్రతిమ లని భావించి వానికి నమస్కరింపఁ బోవును. ఇంతలోఁ బ్రతిమాగృహరక్షకుఁ డగు దేవకులికుఁ డరుగుదెంచి దేవత లనుతలఁపుతో బ్రాహ్మణుఁడు నమస్కారము చేయుచుండె నేమో యని తలఁచి యతనిని వారించును. అవి క్షత్రియుల ప్రతిమ లనియు, నిక్ష్వాకుల వనియు నతఁడు భరతునికిఁ దెలుపును. భరతుఁ డిక్ష్వాకువంశ్యుల ప్రతిమలను దర్శింపఁ గలుగుటకు మిక్కిలి సంతోషించి వా రొక్కొక్క రెవరో యెఱుఁగఁగోరును. అంత దేవకులికుఁడు వరుసగా దిలీప, రఘు, అజమహారాజుల ప్రతిమలను జూపును. వానిని జూచినతరువాత నాప్రతిమల ప్రక్కనే యుండిన దశరథుని ప్రతిమను గాంచి భరతుఁ డాందోళన మందును. అతఁడు

దశరథ ప్రతిమను గూర్చి ప్రశ్నింపక తిరిగి దిలీపాదుల ప్రతిమలనుగూర్చి యునే ప్రశ్న లడుగును. తరువాత మృతు లయిన వారి ప్రతిమలు మాత్రమే ప్రతిమాగృహమున నిలుపఁబడు నని దేవకులికు నడిగి తెలిసికొని భరతుఁడు మిక్కిలి యాందోళన మందును. అపుడు దేవకులికుఁడు దశరథుని ప్రతిమను గూర్చి యతఁ డడుగకుండుటకుఁ గారణ మేమని యడుగును దశరథుఁడు మరణించిన ట్లెఱిఁగించును. భరతుఁ డప్పుడు దశరథుని మరణవృత్తాంతమును దెలిసికొని సవిస్తరముగా నా విషయమును దెలుపవలసిన దని దేవకులికు నొత్తిడి సేయును. దేవకులికునివలన సీతాలక్ష్మణ సహితుఁడై శ్రీరామచంద్రుఁ డరణ్యమునకుఁ బోయె నని తెలిసికొని భరతుఁడు మూర్ఛఁ జెందును. ఈ దుస్థితి కంతకును దన తల్లి యగు కైకేయియే మూల మనియు, నామెకు వివాహ సమయమున దశరథుఁ డొసఁగియుండిన వరములే యిప్పటి దుర్వస్థకు హేతు వనియు భరతుఁడు గ్రహించి యా విషయమునే తలపోయుచుఁ దిరిగి మూర్ఛలో మునుఁగును. ఇంతలో రాణులును సుమంత్రుఁడును ప్రవేశించి మూర్ఛితుఁడై పడియుండిన భరతునికి శీతలోపచారములు సేయుదురు. భరతుఁడు మూర్ఛనుండి క్రమముగాఁ దేరుకొని సుమంత్రుని గుర్తించి, రాణులను జూచి కౌసల్యా సుమిత్రలకు నమస్కరించును. పిదప నాతఁడు తనతల్లి యగు కైకేయిని జూచి కుపితుఁడై యామె తనకుఁ దల్లియే కాదని పలుకుచు నామెకు నమస్కరింప నిరాకరించును. వసిష్ఠాదులు ప్రకృతులతో నరుగుదెంచి రాజ్యాభిషేకమును నంగీకరింప వలసినదని కోరఁగా నాతఁడు రాజ్యాభిషేకమును దిరస్కరించి యడవుల కేఁగి శ్రీరామచంద్రుని దర్శించి యతనిఁ బ్రార్థించి తిరిగి యాతని నయోధ్యకుఁ గొనితేవలయునని నిశ్చయించుకొని యరణ్యములకుఁ బ్రయాణ మగును.

ప్రతిమా నాటకమున నేతదంకము మిక్కిలి ప్రధాన మయినది. ఇందుఁ ప్రతిమాగృహమున నెలకొలుపఁబడిన దశరథప్రతిమను జూచి భరతుఁడు తన జనకుఁ డగు దశరథుని మరణవృత్తాంతమును దెలిసికొనుచున్నాఁడు.

ప్రతిమానాటక మని యీయంకమును బట్టియే యీనాటకమునకుఁ పేరయ్యెను. మఱియు నిందు రాణుల ప్రవేశ మతిమనోహరముగాఁ గావింపఁబడుట గమనార్హము.

## చతుర్థాంకము

చతుర్థాంకప్రారంభమున నున్న ప్రవేశకమున విజయ, చందనిక యను నిరువురు చేటికలు ప్రవేశించి ప్రతిమాగృహమున జరిగిన వృత్తాంతమునుగూర్చి సంభాషింతురు. ఈ ప్రవేశకము కథాగమనమున కొంతయుఁ దోడ్పడుట లేదు. అంక ప్రారంభమునఁ జిత్రకూటమునకుఁ బోవుచు భరతుఁడు రథారూఢుఁడై ప్రవేశించును. శ్రీరామచంద్రుఁ డప్పుడు చిత్రకూటమున నివసించుచుండెను. భరతుఁడు శ్రీరాముఁ డున్న యాశ్రమ ప్రాంతముఁ జేరి తన్నెఱింగించుకొనును. శ్రీరాముఁడును, లక్ష్మణుఁడును నాస్వరము విని యది తమ జనకుఁ డగు దశరథుని కంఠస్వరమును బోలియున్న దని తలపోసిరి. లక్ష్మణుఁ డా వచ్చిన వారెవరో తెలిసికొనవలయు నని యాశ్రమమునుండి వెలికి వచ్చి యచ్చట తన సోదరుఁ డగు శ్రీరామచంద్రుని పోలిక గల యాగంతుకునిఁ జూచును. ఇదప నతఁడు తన్ను లక్ష్మణుఁడుగా గుర్తించి సుమంత్రునిఁగూడఁ జూచును. భరతుఁడును నా వచ్చినవాఁడు తనసోదరుఁ డగు లక్ష్మణుఁ డని యెఱిఁగి యతనికి నమస్కరించును. లక్ష్మణుఁడును నతనికి స్వాగత మొసఁగి యతని యాగమనవార్తను శ్రీరామచంద్రునికిఁ దెలుపుటకై లోనికిఁ బోవును. శ్రీరాముఁడును భరతాగమన విషయమును విని పరమానందభరితుఁడై యాతని లోనికిఁ దెమ్మని సీతతోఁ జెప్పును. సీతయుఁ బర్ణశాలనుండి వెలుపలికి వచ్చి శ్రీరామచంద్రుని రూపు చాలిక భరతునిలో నుండుటను గుఱుతించి యాశ్చర్య మందును. శ్రీరామచంద్రుఁడు బాహువులు సాచి కౌఁగలించుకొని భరతుని నాహ్వానించును. ఇక్కడ శ్రీరామ సుమంత్రుల సమాగమము కరుణరసభూయిష్ఠము. వారిరువురును దశరథమహారాజు విషయము స్మృతికి రాఁగా నిట్టు దుఃఖింతురు. శ్రీరామచంద్రుఁ డిట్లో

శోకమును నిబ్బరించుకొని యుదకము తెమ్మని లక్ష్మణునితోఁ జెప్పెను. కాని భరతుఁ డది న్యాయము కాదనియుఁ గ్రమముతీరునఁ దానే శుశ్రూషింపవలయు ననియుఁ జెప్పి యుదకముఁ దెచ్చెను. శ్రీరామచంద్రుఁడు దాని గ్రహించి యాచమించి 'లక్ష్మణుని శుశ్రూష సడలుచున్న' దని పరిహాసముగాఁ బలుకును. భరతుఁడు శ్రీరామచంద్రునితో నరణ్యములయందే యుండి యతనికి శుశ్రూష చేయఁగోరును. కాని శ్రీరాముఁడు పితృవాక్య పరిపాలనము గావించుటకై భరతు నయోధ్యకు మరలి పోయి రాజ్యపరిపాలనము గావింపవలసిన దని యాదేశించును. అంత భరతుఁడు చేయునది లేక శ్రీరామచంద్రుని పాదుకల నిమ్మని ప్రార్థించును. ఆపాదుకలకు రాజ్యపట్టాభిషేకము చేసి తాను వాని ప్రతినిధిగా నుండి రాజ్యపరిపాలనము గావింతు నని భరతుఁడు తెలుపును. మరియుఁ బదునాలు గేండ్లను గడచిన పిదప శ్రీరామచంద్రుఁడు తిరిగి తన రాజ్యమును బరిగ్రహించునట్లు శ్రీరామచంద్రునికడ నాతఁడు వాగ్దానము గైకొని, సంతృప్తిఁ జెంది యయోధ్యకు మరలిపోవును.

## పంచమాంకము

మనోహరమైన యాశ్రమదృశ్యముతోఁ బంచమాంకము ప్రారంభమగుచున్నది. సీత యాశ్రమవృక్షములకు నీరు పోయుచుండును. శ్రీరామచంద్రుఁడు విషాదవదనుఁడై ప్రవేశించును. తన జనకుఁ డగు దశరథమహారాజులయొక్క యనుసంవత్సరశ్రాద్ధ దినము మఱునాఁడు జరగవలసియుండెను. తన కర్తవ్యమైన తెలంగుఁ గల్పవిశేషముచేతఁ బితరునికిఁ బిండప్రదానము చేయఁ జాలక పోవుచుంటినిగదా యని యతఁడు చింతించుచుండెను. సీత యతని చింత మాన్పుటకుఁ బ్రయత్నించును గాని యాప్రయత్నము విఫల మయ్యెను. ఇట్టిస్థితిలో రావణుఁడు పరివ్రాజకవేషముఁ దాల్చి వారి యాశ్రమముఁ బ్రవేశించును. సీతారాములతనికి సగౌరవముగాఁ బ్రణమిల్లి స్వాగత మిత్తురు. పరివ్రాజక వేషమున

నున్న రావణుఁడు తనకు వివిధశాస్త్రములయందుఁ బాండిత్యము గల దనియుఁ, బ్రాచేతసశ్రాద్ధకల్పమును గూడఁ దా నధ్యయనము చేసితి ననియుఁ దెలుపును. శ్రీరాముఁ డది విని 'ఏమీ? శ్రాద్ధకల్పమును గూడ నధ్యయనము చేసితిరా' యని యావిషయమునఁ బ్రత్యేకశ్రద్ధ గనుపఱుచును. మఱియు నాతఁడు 'పిండప్రదానకాలమందుఁ బితరులు దేనిచేఁ దృప్తి నందుదు' రని యాతనిఁ బ్రశ్నించును. రావణుఁడు వివిధవస్తు సముదాయములలో శ్రాద్ధమునకు శ్రేష్ఠ మయినవానిని వరుసగాఁ బేర్కొని హిమాలయపర్వతమున మాత్రమే లభించు కాంచనపార్శ్వమృగము శ్రాద్ధమునకు మిక్కిలి శ్రేష్ఠ మయిన దని వచించును. 'తపసు చాలని దైనను ధనువు కలదు; ధనువు చాలని దైనను తపసు కలదు' అని శ్రీరాముఁడు తన తపోబలముచే నయినను భుజబలముచే నయినను నా కాంచనపార్శ్వమృగమును తే నభిలషించును. రావణుని మాయచే నా సమీపముననే యొక కాంచనపార్శ్వమృగము వారికి దృష్టిగోచర మగును. తీర్థయాత్రనుండి తిరిగి వచ్చుచుండిన మునికులపతి నెదురుకొని కొనితెచ్చుటకై లక్ష్మణుఁడు పోయి యుండుటచేత శ్రీరామచంద్రుఁడే స్వయముగా నా కాంచనపార్శ్వమృగమును వేఁటాడి తేవలయు నని దాని వెన్నంటి పోవును. సీత యొంటిఁ జిక్కి రావణసమక్షమున నుండవలసివచ్చెను. సీత పర్ణశాలలోనికిఁ బ్రవేశింప నుండఁగా రావణుఁడు తన నిజరూపముఁ దాల్చి యామె నపహరింపఁ బ్రయత్నించును. అంత సీత కరుణార్ద్రముగా నెలుఁగెత్తి విలపించుచుండఁగా రావణుఁడు బలాత్కారముగా నామెను రథముపైఁ గొనిపోవుచుండును. ఆమె యార్తనాదము విని దశరథునికిఁ బ్రాణమిత్రమును, పక్షికుల సార్వభౌముఁడును నగు జటాయువు స్వపక్షపవనోత్క్షేపముచే నరణ్యము నెల్ల క్షుభితపఱుచుచు రావణు నెదుర్కొనును.

రావణుఁడును

'గండా రెడుమద్భుజమున
నిండారం దాల్చినట్టి నిస్త్రింశమునన్
ఖండించి రక్తధారా
కుం డగునిను యమపురమునకుం బంపింతున్.'

అని యతనిమీఁదికిఁ బోవును. దీనితోఁ బంచమాంకము సమాప్త
మగుచున్నది.

ఈ యంకము మనోహరమై నాటకకథాకల్పనమునందు భాసునికిఁ
గల సామర్థ్యమును వేనోళ్ళఁ జాటుచున్నది. రామాయణములోవలె సీత
ముచ్చటఁ దీర్చుటకై కాక శ్రీరాముఁ డిందుఁ దన జనకుఁ డగుదశరథుని
యనుసంవత్సర శ్రాద్ధవిధి నుచితరీతి నెఱవేర్చుటకై కాంచనపార్శ్వ
మృగమును వెన్నంటిపోయె ననియు నాపిదపఁ బరివ్రాజకవేషమున నున్న
రావణుఁడు సీతాపహరము గావించె ననియు మనోహరముగా నిందుఁ
గల్పింపఁబడినది. ఇది గాక సీతాపహరణమునకుఁ బూర్వము లక్ష్మణుఁ
డాశ్రమమున లేనట్లును, దీర్ఘయాత్రనుండి మరలి వచ్చుచుండిన మునికులపతి
నెదురుకొని కొనితెచ్చుటకై పోయియుండె ననియుఁ గల్పించి భాసుఁడు
సీతశీలమున కుదాత్తత చేకూర్చి మెఱుఁగులు దిద్దినాఁడు.

## షష్ఠాంకము

ఏతదంక ప్రారంభమున నున్న విష్కంభమున నిరువురు వృద్ధతాపసులు
ప్రవేశించి జటాయువునకును, రావణునకును జరగిన యుద్ధమును గనులకుఁ
గట్టినట్లు వర్ణింతురు. ఆయుద్ధమున జటాయువు 'గజేంద్రము పెళ్లగింపఁగా
నాటవిక ద్రుమంబు పడినట్లు ధరాస్థలిఁ' గూలెను.

విష్కంభములోని వృత్తాంతము నడచిన చాలనాళ్ళ కయోధ్యలో
నడచు కథావృత్తముతో షష్ఠాంక మారంభ మగుచున్నది. సీతా
రామలక్ష్మణుల యోగక్షేమముల నరసి వచ్చుటకై యరణ్యములకుఁ బోయి
యుండిన సుమంత్రుఁ డయోధ్యకు మరలి వచ్చును. అతని విషణ్ణవదన
మేదో యశుభమును సూచించుచుండెను. భరతుఁడు జటావల్కలధారియై
ప్రవేశించి సుమంత్రు నాహ్వానించును. శ్రీరామచంద్రుఁడు జనస్థానమున
నతని యాశ్రమమునఁ గానరాలే దనియుఁ, దపోవనము శూన్యమై యుండె
ననియు, వానరనివాస మగు కిష్కింధ కాతఁడు వెడలినట్లు వినవచ్చిన

దనియు సుమంత్రుఁడు భరతునికిఁ దెలిపెను. సీతాపహార వృత్తాంతమును భరతునికిఁ దెలియనీయక రహస్యముగా నుంపవలయు నని సుమంత్రుఁడెంచెను గాని సుగ్రీవుని తోడి శ్రీరామసఖ్యము నభివర్ణించుచు 'వాలిఁ గోల్పోయి పర్వతమందు నుండి కావఁబడెఁ దుల్యదుఃఖుఁడు గాన యతఁడు' అని చెప్పుటలో నతనికే తెలియకుండ సీతాపహారణవృత్తాంతమును వెల్లడించును. భరతుఁ డా వృత్తాంతమును విని మిక్కిలి దుఃఖించును. అతఁ డప్పుడు తనతల్లి యగు కైకేయిని గలిసికొని యింత యనర్థమునకుఁ గారణభూతురా లగు నామెను నిందింపఁ దలఁచెను. సుమంత్రునితోఁ గలసి యతఁడు కైకేయికడకుఁ బోవును. భరతుని నిందావాక్యములను, సీతాపహారణవృత్తాంతమును విని కైకేయి శ్రీరామచంద్రునెడఁ దా నంత క్రూరముగాఁ బ్రవర్తించుటకుఁ గారణ మేమో నిజము వెల్లడించుట కదియే మంచి సమయ మని తలపోయును. ఆమె కోరిక మేరకు సుమంత్రుఁడు దశరథమహారాజునకుఁ బూర్వ మెప్పుడో కన్నులు గాననివృద్ధమునిదంపతు లిడిన శాప వృత్తాంతమును సవిస్తరముగాఁ దెలుపును. ఆ శాపప్రకారము దశరథుఁడు పుత్రశోకముచే మరణింపవలసి యున్న దనియు, నది తప్పరాని దనియు, నా పుత్రశోకము పుత్ర మరణముచేఁ గాని పుత్రవియోగముచేఁ గాని యొనఁగూడఁ దగు ననియుఁ దెలిపి శ్రీరామచంద్రుని మరణ మా శాప ప్రకారము సంభవింపఁ జేయకుండుటకయియే యతనివలని వియోగమును దశరథునికిఁ గల్పించుటకుఁ దాను బ్రయత్నించె ననియుఁ గైక విశదీకరించెను. మఱియు వసిష్ఠవామదేవప్రభృతు లగు గురుజనమునకుఁ గూడ నీ విషయము తెలుపఁబడిన దనియు నీ ప్రయత్నమునకు వా రెల్లరు సమ్మతించి రనియు నామె తెలిపెను. మాతుల గృహమున నుండిన భరతునివలని విప్రయోగము స్వాభావికముగానే యేర్పడియుండుటచే శ్రీరామచంద్రుఁడు మాత్రమే యరణ్యమునకుఁ బంపఁబడవలసినవాఁ డయ్యె ననియు, విప్రవాసమునకుఁ బదునాలుగేండ్లని హద్దేల పెట్టవలయు నని భరతుఁ డడుగఁగా నా

బెడదలో మనసు చెదరిపోయి పదునాలుగు నాళ్ళనఁబోయి పదునాలుగేళ్ళని తననోటినుండి మాట జాఱె ననియు నామె భరతునికిఁ బరిస్థితులు విశదీకరించెను. భరతుఁ డామె తెలిపినవిషయముల విని సంతృప్తుఁడై యామె యనపరాధురా లని యెఱిఁగి యన్నగారిమీఁది యధికభక్తిచే దుస్సహక్రోధమున నామెను దూషించినతన్ను మన్నింపవలయు నని యామె పాదములపైఁ బడి, నమస్కరించి క్షమాభిక్ష వేఁడును. ఆమెయు నాతని క్షమించును. అంత భరతుఁడు రావణసంహారమున శ్రీరామునికి సహాయ మగుటకై రాజమండలముల నెల్ల సన్నాహపఱుచుటకు నిశ్చయించును. ఇంతలో సీతాపహారవృత్తాంతమును విని పెద్దదొరసానిగారగు కౌసల్య మూర్ఛ చెందె నని ప్రతీహారి ప్రవేశించి తెలుపును. మూర్ఛనుండి తేర్చి యామె నోదార్చుటకై వా రెల్లరు నామె యంతఃపురమునకుఁ బోవుదురు.

కథానిర్మాణదృష్టితోఁ జూచినపు డేతదంకమునకు నాటకమున నంతగాఁ బ్రాముఖ్య మున్నట్లు కానరాదు. శ్రీరామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁ డగుట యుద్దిష్టప్రధానఫలము. కైకేయీహృదయ మందుకు సుముఖము గానే యున్న దని తెలుపుటలో నీయంక మించుకంత యుపకరించు మన్నది. శ్రీరామచంద్రుని పట్టాభిషేకము సిద్ధించుటలోఁ గల దొడ్డ యడ్డంకులలోఁ బ్రధాన మయిన దీయంకమునఁ దొలఁగింపఁబడినది. మఱియు నీయంకమున భరతుఁడు, సుమంత్రుఁడు, కైకేయి యనువారి శీలము లుదాత్తములుగాఁ జిత్రింపఁబడి వారియెడఁ బ్రేక్షకులకు సానుభూతిని గౌరవమును సంపాదింపఁ జేయుచున్నవి.

## సప్తమాంకము

ఏతదంకప్రారంభమున నున్న విష్కంభములోని వృత్తాంతము జనస్థానమునందలి తపోవనమున నడచినది. రామరావణయుద్ధము ముగిసినది. రావణాసురుని సంహరించి శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నయోధ్యకు మరలి వచ్చుచుండెను. మార్గమధ్యమున జనస్థానమున వారికి

స్వాగత మిచ్చుటకై ప్రయత్నము సాగుచుండెను. తపోవనమునందలి నందిలకుఁ డను తాపసుఁడు విభీషణసంబంధు లగురాక్షసుల సత్కరించుటకై కలుకుట్లు మొదలగునవి కావలసియున్న వనియు వానిని సంపాదించుట యెట్లనియు సంతాపించుచుండును. మఱియొక తాపసుఁడు 'రాక్షసు లిప్పుడు విభీషణవిధేయులు. కనుక నీ వాత్రపడ నక్కఱలే' దని యతని భయ మాడుపును. అంకప్రారంభమున శ్రీరామచంద్రుఁడు 'గురుశాసనముఁ గడముట్టఁ జల్పి' నందులకు సంతోషించుచుఁ బ్రవేశించును. అంత సీత తాపసిజనముచే సత్కృతుల నంది ప్రవేశించును. వా రిరువురును జనస్థానమునఁ దాము పూర్వము గడపిన దినములను స్మృతిపథమునకుఁ దెచ్చుకొని యప్పుడు జరిగిన కొన్ని సంఘటనలను గూర్చి సంభాషించు చుందురు. ఇంతలో భరతుఁడు కౌసల్యాదులతో నయోధ్యనుండి శ్రీరామ చంద్రుని దర్శించి యతని నభినందించుటకై యరుదెంచును. అతఁడు తనతో నొక గొప్పసైన్యమును, బురోహితులను గొనివచ్చి యుండెను. శత్రుఘ్నుఁడు వచ్చి శ్రీరామచంద్రున కభివాదనము చేయును. వసిష్ఠ వామదేవ ప్రభృతులు పౌరవర్గముతో నచ్చటికి నరుదెంచి యున్నా రనియు, వారు శ్రీరామ చంద్రునికిఁ బట్టాభిషేకము సేయ నభిలషించుచున్నా రనియు శత్రుఘ్నుఁడు శ్రీరామచంద్రున కెఱిఁగించును. కైకేయియు 'నాయనా! పద! యభిషేకము నంగీకరింపు'మనును. శ్రీరామచంద్రుఁడును నందులకు సమ్మతించును. మునిజనసమక్షమునఁ దాత్కాలికముగా జనస్థానమున శ్రీరామపట్టాభిషేకము జరిగినను పిదప నయోధ్యలో యథావిధిఁ బట్టాభిషేకము జరగవలయు నని కైక కోరును. శ్రీరామచంద్రునకుఁ బట్టాభిషేకము మహావైభవముతో జరగును. కాని యీ పట్టాభిషేకము నేపథ్యమున జరగునట్లు రచింపఁబడినది. విజయఘోషణమాత్రము నేపథ్యమునుండి పట్టాభిషేకవైభవమును సూచిం చుచు వినవచ్చుచుండును. శ్రీరామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁడై తిరిగి ప్రవే శించి యాకాశముపైపు చూచి 'దివమునసుండి యేని పరితృప్తిని జెందుమ యందు వీడుమా!' యని దశరథు నుద్దేశించి పలుకును. ఇంతలోఁ బుష్పక

విమాన మరుదేరఁగా వా రెల్లరు నం దారూఢులై యయోధ్యకుఁ బయన మగుదురు. శుభాంతముగా నీ నాటక మిట్లు పరిసమాప్తి చెందినది.

## పాత్రచిత్రణము

### (Characterization)

ఇతరసంస్కృతనాటకములందువలెఁ గాక బహుభూమికా చిత్రణము భాసునినాటకములలోఁ గానవచ్చు ప్రత్యేకత. బాణుఁడు భాసుని నాటకములనుగూర్చి ప్రశంసించుచు 'బహుభూమికైః' అని యీ విషయమునే యుద్ఘాటించినాఁడు. భాసుఁడు తననాటకములకుఁ గావలసిన పాత్రముల గ్రహించువిషయమునఁ జూపినశ్రద్ధ మిక్కిలి ప్రశంసనీయము. సంఘములోని యన్నితరగతులవారికిని దననాటకములందుఁ బ్రవేశార్హతఁ గల్పించి భాసుఁడు తనయౌదార్యమును బ్రకటించె ననవలసియున్నది. పవిత్ర మయినశీలము, ఋజుప్రవర్తనము గలసజీవపాత్రములు భాసుని నాటకములందు మనకుఁ గానవత్తురు. సాధారణముగా సంస్కృతనాటకములం గుఁ జిత్రింపఁబడుపాత్రములవలెఁ గాక భాసుని నాటకములందలి పాత్రములలో నొక్కొక్కరును వైయక్తికగుణవిశేషములతోఁ బ్రతిభాసించుచుఁ బ్రేక్షకుల యాదరాభిమానములను జూఱగొనుట గమనార్హమయినవిషయము.

## శ్రీరామచంద్రుని శీలము

ప్రతిమా నాటకమునందు శ్రీరామచంద్రుఁడు నాయకుఁడు. అవతార పురుషుఁడుగాఁ గాక దశరథమహారాజులుంగారి కుమారుఁడుగా, సీతాదేవికి ననుకూలుఁ డగుప్రియుఁడుగా, భ్రాతృవత్సలుఁడుగా, ప్రజారంజకుఁ డయినపరిపాలకుఁడుగా, శత్రుసంహారమునఁ దనియు బాహుపరాక్రమ సంపన్నుఁడుగా మెఱయుచు శ్రీరామచంద్రుఁ డిందు మానవలక్షణములతోఁ బ్రతిభాసించుచున్నాఁడు. శ్రీరామచంద్రుఁ డాదర్శమానవుఁడు.

పితృభక్తి :

మానవునిలో నుండవలసిన సర్వసద్గుణములును శ్రీరామచంద్రునిలో మూర్తీభవించి యున్నవని చెప్పవలయును. కాని యాతని సద్గుణములలో నెల్లఁ జెప్పఁదగినది యాతని కాతని తండ్రియెడఁగల యపార మయిన భక్తి. తొలుదొలుత దశరథమహారాజులుంగారు బాల్యాభ్యస్త మయిన తన తొడపై నాతనిఁ గూర్చుండఁ బెట్టుకొని పట్టాభిషిక్తుఁడవు కమ్మని కోరి నప్పుడు తనకు రాజ్యభారము మోయుట యిష్టము కాకున్నను దనతండ్రికోరి కను నెఱవేర్చుట కయియే యాతఁడు పట్టాభిషేకమున కంగీకరించెను. పట్టాభిషేకభంగము వాటిల్లినప్పుడుకూడ నాతఁ డందులకు సంతోషించెనే కాని యణుమాత్ర మయినను విచార మందలేదు. తనతండ్రి యగు దశరథమహారాజులుంగారు కైకేయికి నొసఁగియుండిన వాగ్దానము చెల్లించుటకై పదునాలుగేండ్లు తా నరణ్యవాసము చేయవలసియున్న దని తెలిపినప్పుడును నాతఁడు వికార మందలేదు. తండ్రియెడఁ గుమారుఁడు చూపవలసిన విధిగా నాతఁ డరణ్యములకుఁ బోవుటకు సంతోషముతో నంగీకరించినాఁడు. శ్రీరామచంద్రుఁ డరణ్యములలో నుండఁగా భరతుఁ డయోధ్యకు వచ్చి రాజ్యపట్టాభిషేకము నంగీకరింపు మని ప్రార్థించినప్పుడుకూడ నతఁడు భరతునికిఁ దమతండ్రియాజ్ఞ నెఱవేర్పవలసియున్న దని హెచ్చరించి తన పాదుకల నాతని కొసఁగి తాను పిత్రాజ్ఞ మేరకుఁ బదునాలుగేం డ్లరణ్యవాసము నెఱవేర్చి వచ్చువఱకు రాజ్యకార్యము చూచుచుండవలసిన దని చెప్పి పంపును. దశరథశ్రాద్ధదివసమునకుఁ బూర్వదివసమున నతఁడు తన తండ్రి కుచితవిధమున శ్రాద్ధము పెట్టుటకు వీలులేకపోయినది గదా యని మిక్కిలి వ్యథ నొందును. అరణ్యములయందుఁ దాను పడుచున్న కష్టములఁ దనతండ్రికి గుఱుతునకుఁ దెచ్చి యతఁడు వ్యథ నొందునట్లు చేయ నతని కిష్టము లేదు. సీతాపహారముకూడ శ్రీరామచంద్రుని కతని తండ్రిమీఁద నుండు నపార మయినభక్తిమూలముననే జరగినది. తనతండ్రిగారి కుచితవిధమునఁ బిండప్రదానము చేయఁదలఁచియే యతఁడు కాంచనపార్శ్వ మృగమును

వెన్నంటిపోవును గాని సీతముచ్చట దీర్చుటకుఁ గాదు. కడపట శ్రీరామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁ డయినప్పుడు కూడ నతఁడు దివమునుండి యయినను తనతండ్రి యగుదశరథుఁడు పరితృప్తి నెందుఁగాక యని యభిలషించెను.

అనుకూలనాయకుఁడు :

శ్రీరామచంద్రుఁడు సీతకు ననుకూలనాయకుఁడు. ఆమెయెడ శ్రీరామచంద్రున కత్యధిక మగుప్రేమము గలదు. వా రిరువురును 'తుల్యశీలు రగు దంపతులు'. ప్రథమాంకమునందును, పంచమాంకమునందును, సప్తమాంకమునందును గల సీతారామ సంభాషణము శ్రీరామచంద్రునకు సీతయెడఁ గలప్రేమమును వెల్లడి సేయఁజాలియున్నది. ప్రథమాంకమున సీత వల్కలమును ధరించి యుండుటను జూచి శ్రీరామచంద్రుఁడు తానును వల్కలమును ధరింపఁగోరును. ఆమె యలంకారములను ధరించుచుండఁగా శ్రీరామచంద్రుఁ డామె కద్దము పట్టును. తనతోఁగూడ నామె యడవులకు బయలుదేరఁగా క్రూరమృగసంచారము గల యరణ్యములు స్త్రీజనదుష్ప్రవేశము లని యతఁ డామెను వారించును. కాని 'యడవులు నాకు మేడువులే అవుతవి సుమండీ' యని చెప్పి దయనీయముగా నామె ప్రార్థింపఁగా నామె కోరికను గాదనలేక శ్రీరామచంద్రుఁ డామె రాకకు నంగీకరించెను. పంచమాంకమున సీత నాశ్రమప్రదేశములకు సీత పోయియుండఁగా నాతఁ డామెదుస్థితికి మిక్కిలి వగచును. సర్వవిషయములందును సతికి సమానభాగస్వామిత్వము కల దని యాతనివిశ్వాసము. శ్రీరామచంద్రుఁడు సీతకుఁ దెలుపక రహస్యముగ దాఁచి యుంచినరహస్యము లేదు. తనతండ్రి యగు దశరథుని యాను సంవత్సర శ్రాద్ధవిధి నెట్లు నెఱవేర్పవలయునో యని యతఁడు సీతతో సంప్రతించును. దీనిఁ బట్టి యాతఁడు తనభార్యకుఁ గుటుంబవ్యవహారము లందెట్టి యాదరము చూపుచుండెనో వెల్లడి కాఁగలదు. రావణుఁ డామె నపహరింపఁగా నాతఁ డాతనిపై దండెత్తి పోయి యాతని సంహరించి

యయోధ్యకు సీతాసమేతుఁడై మరలి వచ్చును. దీనిఁ బట్టి సీతపై శ్రీరామచంద్రున కెంత ప్రేమము కలదో వెల్లడి యగును.

కైకయెడఁ గోపము లేమి :

ఆతఁడు కైకేయీవిషయమునఁ బ్రవర్తించినతీరాతని శీలము యొక్క గొప్పదనమున కొకదృష్టాంత మని చెప్పవచ్చును. ఆతఁడు కైకేయియెడఁ బ్రేమమును, గౌరవమును గలిగియుండుటయే గాక యామె యేది చేసినను నది తనమేలునకే యని విశ్వసించుచుండెను. 'అట్లయిన నది ఫలోత్తరమైనమేలే కావలె' నని యాతఁడు వచించి యుండుట దీనికి నిదర్శనము. కాంచుకీయుఁడు వచ్చి కైకేయిస్వార్థపరతను గూర్చియు, పట్టాభిషేకభంగమునకై యామె ప్రయత్నించుటను గూర్చియుఁ జెప్పుచుండఁగా నాతఁడు కైకేయి మీఁది యపదూఱు విన నొల్లఁ డయ్యెను. పైపెచ్చు, ఆమె యొనర్చినకార్యము న్యాయ్యమే యనియు వచించును. ఆమెవివాహసమయమున దశరథుఁ డామె కిచ్చియుండిన వరముల నడుగుకొనుటలో నామెత ప్పేమియు లేదని యాతఁడు తలఁచెను. క్రోధోద్రిక్తుఁడై 'తాల్పుము విల్లు తేనిపరితాపము సైపనిచో' నని వచ్చిన లక్ష్మణు నాతఁడు శాంతింపఁజేసి కైకేయికోరిక న్యాయసమ్మతమైనదే యని యాతని కుద్బోధించి మాఱుమాట చెప్పక యడవులకుఁ బోఁదలఁచును. నిజముగాఁ గైకేయిని సరిగా నర్థము చేసికొన్నపాత్ర యొక్క శ్రీరామచంద్రుఁడే యని చెప్పుటకు సందియ మావంతయు లేదు.

సోదర ప్రేమ :

ఆతఁడు తనసోదరులయెడ మిక్కిలి ప్రేమ గలిగి యుండెను. లక్ష్మణు నాతఁడు తనయర్థదేహముగా సంభావించుచుండెను. లక్ష్మణునికిఁ దనపై నున్న గాఢానురాగము నెఱిఁగినవాఁ డగుటచే శ్రీరామచంద్రుఁ డాతనిని దనవెంట నరణ్యములకుఁ దీసికొని పోవుట కంగీకరించెను. ఆతఁడు చిత్రకూటమున నుండఁగా భరతుఁ డయోధ్యనుండి యాతనిఁ

గొనిపోవుటకు వచ్చినప్పు డాతఁడు భరతునికి హృదయపూర్వక మయిన స్వాగతము నొసంగెను. ఆఘట్టమున నాతనికి భరతునిపై నెంత ప్రేమము కలదో స్పష్ట మగుచున్నది. అతనిని తృప్తిపఱచుట కనియే యాతఁడు పదునాలుగేండ్ల వనవాసము నయినతరువాత రాజ్యపట్టాభిషేకము స్వీకరింతు నని మాట యిచ్చెను. అతనికి సంతోషమును జేకూర్చుట కనియే శ్రీరామ చంద్రుఁడు తన పాదుకల నాతని కొసఁగి పంపెను.

శౌరశిఖామణి :

శ్రీరామచంద్రుఁడు గొప్పవీరుఁడు. అతనికిఁ దనబల మెట్టిదో బాగుగాఁ దెలియును. కాంచనపార్శ్వమృగమును దాను దప్పక తేఁగలనను గట్టివిశ్వాస మాతని కుండెను.

‘తపసు చాలనిదైనను ధనువు గలదు
ధనువు చాలనిదైనను దపసు గలదు’ అని యాతఁడు పలికిన పలుకు లాతనికిఁ దనసామర్థ్యమువిషయమునఁ గల విశ్వాసమును వెల్లడి సేయుచున్నవి.

అతనికిఁ బరివ్రాజకులపై భక్తి మెండు. తనభార్య యగుసీత నొకపరివ్రాజకునితో వదలి కాంచనపార్శ్వమృగమునకై యాశ్రమము విడిచి పోవుటకుఁ గూడ నాతఁడు వెనుదీయలేదు. అతఁ డెల్లప్పుడును ప్రజాసంక్షేమమును వాంఛించుచుండును. ఒక్కక్షణము గూడ రాజ్య మేమఱియుండరాని దని భరతుని కాతఁడు గావించినయుపదేశ మాతనికిఁ బ్రజల క్షేమవిషయమున నెంత శ్రద్ధ గలదో వెల్లడి సేయుచున్నది.

ప్రజానురంజకత్వము :

శ్రీరామచంద్రుఁడు ప్రజానురాగము చూఱగొన్న పరిపాలకుఁడు. ప్రతిమా నాటకమున ననేకస్థలములం దాతఁడు చంద్రునితో నుపమింపఁ బడెను. అతనికిఁ బట్టాభిషేకము జరుగు నని యతనిరాజ్యములోని ప్రజలెల్లరును నత్యంతసంతోషస్వాంతులై యుండిరి. కాని పట్టాభిషేకభంగము జరగిన దనియు, శ్రీరామచంద్రుఁడు తనభార్య యగు సీతతోడను, దనసోదరుఁ డగులక్ష్మణునితోడను నడవులకుఁ బోవుచున్నాఁ డనియుఁ దెలిసి ప్రజ

లెల్లరును బాష్పపూరితనయనులై మిక్కిలి విచారించుచు నాతఁడు చను చుండిన మార్గమునం వెల్లెడల చూఁచుగియుండిరి. పదునాలుగేండ్లు గడచిన పిదప శ్రీరామచంద్రుఁడయోధ్యకుఁ దిరిగి మరలి వచ్చినప్పుడు వారు మిక్కిలి యుత్సాహముతోడను, గౌరవముతోడను నాతనికి స్వాగత మొసఁగిరి.

ప్రతిమా నాటకమున శ్రీరామచంద్రుని శీలము చక్కగాఁ బరి పోషింపఁబడలేదని కాలేమహాశయుని యభిప్రాయము. సీత వల్కలమును ధరించి యుండఁగాఁ జూచి తాను నట్టివల్కలమును దాల్ప నుత్సహించుట నాయకుఁడయిన యాతని శీలౌన్నత్యమునకుఁ గొఱఁత యని యాతని యభిప్రాయము. కాని యా సందర్భ మాతని మానవసహజలక్షణమును వ్యక్తము చేయుచు మనోహరముగా నున్న దనుటలో సందేహము లేదు. అతనికిఁ దనభార్య యగుసీతపైఁ గల ప్రేమము సాటిలేనిది. తన కష్టసుఖ ములలో నామెకును సమానభాగస్వామిత్వము గల దని యాతని విశ్వా సము. అందు కనియే యాతఁ డామె వల్కలమును ధరించి యుండుటను జూచి తానును నట్టిదాని ధరింపఁ గోరును. ఈ విషయము నాతని యీ క్రిందిపలుకులే వ్యక్తము చేయుచున్నవి.

"...............నా మేనిలో సగమ వీవు
దాల్చితి. నేను దాల్చుచుంద మది గాదె"

మఱియు శ్రీరామచంద్రుని శీలమువిషయమున కాలే మహాశయుఁడు మఱొకలోపమును గూడఁ జేర్కొనుచున్నాఁడు. శ్రీరామచంద్రుఁడు సీతా లక్ష్మణులతో నడవులకుఁ బోవుచుండఁగా దశరథుఁడు వారిని జూడఁ గోరును. కాని శ్రీరామచంద్రుఁడు దశరథునిఁ జూడ నిరాకరించి యడ వులకుఁ బోవును. అట్లు గావించుట యాతని యుదాత్తశీలమునకు భంజక ముగా నున్న దని కాలేపండితుని యభిప్రాయము. కాని శ్రీరామచంద్రుఁ డా సమయమునఁ బలికినపలుకులను జక్కఁగ గమనించినచో నాతఁ డెట్టి దోష మును గావింపలే దని వ్యక్తము కాఁగలదు. తమపై విశేషవాత్సల్యము

గలిగినదశరథుని వీడిపోవుఘట్ట మాతనికి హృదయవిదారకముగా నుండు నని తలఁచియే యాతఁడు దశరథునిఁ జూడక నిరాకరించి యుండు నని మనము తలఁపవలయును.

పరివ్రాజకవేషమున నున్న రావణుఁడు కాంచనపార్శ్వమృగములు హిమాలయమునఁ గల వని చెప్పినప్పుడు శ్రీరామచంద్రుఁ డావిషయమై యించుకమాత్రముకూడ సందేహము వెల్లడింపక యాతనిమాటలను విశ్వసించుట చిత్రముగాను, హాస్యాస్పదముగాను నున్న దనియు, శ్రీరామచంద్రునివంటి యుత్తమనాయకున కిట్లు విశ్వసించుట తగ దనియు కాలే మహాశయుని యభిప్రాయము. కాని మన మప్పటి సంగతి సందర్భములను సంపూర్ణముగా నవగతము చేసికొనవలసి యున్నది. అట్లు సరిగా నర్థము చేసికొనినఁ గాని మనము భాసుని సరిగా నర్థము చేసికొనఁజాలము. దశరథుని యనుసంవత్సరశ్రాద్ధము నాతని కుచిత మగునవిధమున జరుపవలయు నని శ్రీరామచంద్రుఁడు మిక్కిలిగా విచారించుచుండెను. ఆ సమయమున రావణుఁడు పరివ్రాజకవేషముతో నరుదెంచెను. అతఁడు సర్వశాస్త్రప్రవీణుఁడు. మఱియు నాకాలమునఁ బరివ్రాజకులపై గృహస్థులకు విశేషగౌరవ ముండెడిది. కనుక పరివ్రాజకవేషమున వచ్చిన రావణుని విషయములో శ్రీరామచంద్రుని కెట్టి సందేహమును గలుగుట కవకాశమే లేదు. ఏతద్ఘట్టమున లోప మావంతయు లేదు సరిగదా పైపెచ్చు శ్రీరామచంద్రుని బుద్ధిప్రవర్తనమును, నతనికి నతనితండ్రి యగు దశరథునిపైఁ గలభక్త్యతిశయమును నిది వెల్లడి సేయుచు మనోహరముగా నున్నది.

## భరతుని శీలము

ప్రతిమానాటకమున నాయకుఁ డగు శ్రీరామచంద్రునకుఁ దరువాతఁ బేర్కొనఁ దగినవాఁడు భరతుఁడు. కొన్నిఘట్టములం దీతఁడు శ్రీరామచంద్రుని కన్న మిన్నగాఁ గూడఁ జిత్రింపఁ బడియుండుట గమనార్హ మయినవిషయము. ప్రతిమానాటకమున భరతుని పాత్రమునకుఁ

గల ప్రాముఖ్యము ప్రశంసనీయము. తృతీయాంకమునను, చతుర్థాంకమునను, షష్ఠాంకమునను భరతుఁడే ప్రధానపాత్రము. ఒక్కొక్కప్పుడు భరతుఁడే నాయకుఁ డనుభ్రాంతికూడఁ గలుగు ననుటలో సందేహము లేదు.

భరతునిలో నతనితండ్రి యగు దశరథ మహారాజులుంగారి రూపు చాలిక విశేషముగాఁ గలదు. నాటకమునఁ బలుసందర్భములలో నావిషయము పలువురచేఁ జెప్పఁబడినది. అతని స్వరముకూడ దశరథుని స్వరముఁ బోలి గంభీరముగను, స్పష్టముగను, నుదాత్తముగను నుండెను.

భరతుఁడు చాలనాళ్లనుండి యతని మాతులగృహమునం దుండెను. తనతండ్రిగా రగుదశరథమహారాజులుంగా రస్వస్థశరీరులుగా నున్నా రని విని యాతఁ డయోధ్యకు రథారూఢుఁడై వచ్చెను. అయోధ్యలో జరగిన విషయము లేవియు నతనికిఁ దెలియవు. ప్రతిమాగృహమున మృతు లయిన యిక్ష్వాకువంశ ప్రభువులతోఁబాటు తనతండ్రి యగు దశరథమహారాజులుం గారి ప్రతిమకూడ నుండుటను జూచి యందుమూలమునఁ దనతండ్రి మరణించె నని యాతఁ డెఱుంగఁ గల్గెను. శ్రీరామచంద్రుఁ డరణ్యముల కేఁగుటయు, నావిషయమునఁ దనతల్లి యగుకైకేయి దుశ్చింతయు నాతఁ డప్పుడే తెలిసికొనెను.

శ్రీరామునియెడ నాతనికి భక్తిగౌరవములు మెండు. తన సోదరుని యరణ్యగమనవిషయము తెలిసి యాతఁ డుగ్రుఁ డయ్యెను. సిగ్గుచే నాతఁడు చిదికిపోయెను. శ్రీరామచంద్రుని వనగమనమునకును, దశరథుని మరణ మునకును గారణభూతురా లయిన తనతల్లి యగుకైకపై నతనికి మిక్కిలి కోపము వచ్చెను. ఆమె స్వార్థపరత్వము ననేకవిధములఁ దూలనాడి యామెను దనతల్లిగాఁ గూడ నంగీకరించుట కాతఁ డొల్లఁ డయ్యెను. మగనికి విరుద్ధముగాఁ బ్రవర్తించుకొంత తల్లి కానేర దని యాతఁడు వచించెను. కౌసల్యా సుమిత్రలమధ్య నిలుచుటకుఁ గూడఁ గైకకు యోగ్యత చాల దని యాతఁ డామెను దూలనాడెను. కైకేయీ

ప్రయత్నమునఁ దనకు భాగస్వామిత్వ ముండరా దనియుఁ, దన నిర్దోషిత్వము బుజువు చేసికొనవలయు ననియు నతఁడు తలఁచెను. శ్రీరామ చంద్రుఁడు లేనియయోధ్యలో నడుగు పెట్టుటకుఁ గూడ నాతఁడు నిరాకరించును. రాముఁ డెం దుండునో యదే యాతని కయోధ్య. అతఁడు వెంటనే శ్రీరామచంద్రుఁ డున్నయరణ్యములకుఁ బోయి యాతనిఁ దిరిగి యయోధ్యకు వచ్చి రాజ్యపట్టాభిషేకము స్వీకరింపు మని కోరును. కాని శ్రీరామచంద్రుఁ డాతనికోరికను నిరాకరించి యాతని నయోధ్యకుఁ బోయి రాజ్యపరిపాలనము చేయవలసిన దని యాజ్ఞాపించును. పితృవాక్యము నను బరిపాలించుట యిరువురకును గర్తవ్య మని యాతఁ డుపదేశించును. మఱియు శ్రీరామచంద్రుఁడు భరతుని యవ్యాజప్రేమమునకు వశుఁడై పదునాలు గేండ్లు వనవాసము ముగిసినపిమ్మటఁ దా నయోధ్యకు వచ్చి రాజ్యపట్టాభిషేకము స్వీకరింతు నని యాతనికి మాట యిచ్చెను. అంత భరతుఁడు శ్రీరామచంద్రుని పాదుకల నిమ్మని యడిగెను. ఆపాదుకలను సింహాసనముపై నుంచి వానికిఁ బ్రతినిధిగా మాత్రమే యుండి తాను రాజ్యము పరిపాలింతు నని యాతఁడు శ్రీరామచంద్రున కెఱిఁగించెను. శ్రీరామచంద్రుఁడును నందుల కంగీకరించి యాతనికిఁ దనపాదుకల నొసఁగెను. భరతుఁడు శ్రీరామచంద్రుని పాదుకలను గైకొని యయోధ్యకు మరలిపోయి తా నాపాదుకలకుఁ బ్రతినిధిగా నుండి రాజ్యపరిపాలనము గావించును.

అయోధ్యలోఁ గూడ నాతఁడు భోగభాగ్యములకు దూరుఁడై తాపసవృత్తిలోనే జీవితము గడపుచుండెను. శ్రీరామచంద్రుఁడు భరతుని గూర్చి చెప్పిన యీక్రిందివాక్యము లాతనిశీలమును జక్కఁగాఁ జిత్రించు చున్నవి.

'ఇంచుకమాత్ర యశం బా

ర్జించితి నే నింతకుఁ జిరకాలమునన్

గొంచెపుఁగాలమునని యా
ర్జించెఁ భరతుండు జగతి స్థిరతరయశముఁ'

భరతుఁడు తనసోదరుఁ డయిన శ్రీరామచంద్రుని విషయమై యెల్లప్పుడును జాగరూకత వహించుచుండెడివాఁడు. శ్రీరామచంద్రుఁ డరణ్యములలో నున్నప్పుడు వారి క్షేమము నారసి వచ్చుట కతఁడు సుమంత్రునిఁ బంపెను. సుమంత్రుఁ డడవులకుఁ బోయి వచ్చి సీతారామలక్ష్మణు లాశ్రమమున లేరనియు, సీత రావణాసురునిచే నపహరింపఁబడిన దనియుఁ జెప్పఁగా భరతుఁడు మిక్కిలి విచార మందెను. వెంటనే కోపముతో నాతఁడు తనతల్లి యగు కైకేయికడకుఁ బోయి యామె ననేకవిధములఁ దూలనాడెను. కాంతాపహరణసంకటముకూడ నిక్ష్వాకులకుఁ గైకమూలముననే గలిగె నని యాతఁ డామెను దూషించెను. అప్పుడు కైకేయి తాను విధిచేతి యుపకరణముగా మాత్రమే వ్యవహరించె ననియు, నావిషయమునఁ దన దేవిధ మయినదోషమును లే దనియుఁ దెలుపును. ఋషి శాపము నిర్వర్తింపఁ బడవలసి యుండెను. ఆబెడదలోఁ బదునాలుగునాళ్లనఁ బోయి యామె పదునాలుగేళ్లని యనినది గాని యది యామె బుద్ధిపూర్వకముగాఁ జేసినది కాదు. గురుజనాభ్యనుజ్ఞ కూడఁ దన కృత్యమునకుఁ గల దని యామె నిరూపించెను. అప్పుడు భరతుఁడు తనతల్లి కైకేయి నిర్దోషురా లని యెఱిఁగి యామెను దూలనాడినందులకుఁ దన్ను క్షమింప వలసిన దని యామెను వేఁడుకొనెను. కైకయు నాతనిని క్షమించును.

వెంటనే యాతఁడు సైన్యముల నెల్ల సమీకరించుకొని సామంతరాజుల సహాయముతో రావణునిమీఁది కెత్తి పోవ నిశ్చయించును. పదునాలుగేండ్ల వనవాసము కడచినపిదప శ్రీరామచంద్రుఁ డయోధ్యకు వచ్చుచుండఁగా జనస్థానమున నాతని దర్శింపఁబోయి భరతుఁ డత్యుత్సాహముతో నాతని దర్శించి ముద మందును. శ్రీరామచంద్రుని పట్టాభిషేకము జనస్థానమున మునిజనసమక్షమున సక్రమముగా జరిగెను.

అది చూచి భరతుఁ డానందపరవశుఁ డయ్యెను. భరతున కంతకంటెఁ గావలసిన దేదియు లేదు.

ప్రతిమానాటకమున భరతుఁడు కల్ల కపటము లెఱుఁగని మధుర మనోహరమూర్తి. నిర్మాయుఁడు. భక్తి రూపము గొన్న యాకృతి యాతఁడు!

## సీత శీలము

ప్రతిమానాటకమున నాయిక యగుసీతాదేవి భారతీయగృహిణీ ధర్మము మూర్తి గొన్న యాదర్శమహిళ. సీత

‘ నేల దున్నుచో నాగంటిచాలువలన
నవతరించిన స్త్రీమయ మయిన తేజ
మిది జనకభూమివిభుని యహీనపుణ్య
తపమునకు ముఱియును సన్నిదర్శనంబు ’—

జనకరాజపుత్త్రియు, దశరథుని పెద్దకోడలు నగునామె చక్కని చుక్క. సుందర మయిన యామె సుకుమార శరీరమున ‘ నారచీర యయినా పమిడిచీర లాగు ’ వెలుఁగొందును. సుమంత్రునిదృష్టిలో సీత మూర్తిమంత మయిన ‘ శీలము ’. రావణుఁడుకూడఁ బతిశీల యగుసీతను గూర్చి

‘ పుణ్యసాధ్వి యీమె భూమి నరుంధతి
కొంత మావె మర్త్యకాంతలందు ’— అని పలుకును.

ఆమె ‘ద్విధాభూత మగునరుంధతీ చరిత్రము’. ఆమె పతివ్రతా తేజము సూర్యకిరణములకంటెను సుతీక్ష్ణ మయినది. పంచమాంకమున నామె ‘శపియింతు’ నన్న పలుకుతాఁకుచే రావణునిశరీర మెల్ల దగ్ధ మయిన ట్లయ్యెను. ఆమె పతిభక్తి యద్వితీయము. శ్రీరామచంద్రుని కామె ‘యవస్థాకుటుంబిని’. అందుచేత నే యలంకరణము గావించుకొనునపుడు ముకురమును జేతఁ దాల్చినంత నే కందిపోవునంతటి సుకుమారశరీరము గల యామె భర్తతో ఘోరారణ్యభూములకుఁ బోవుటకుఁగూడ వెనుదీయలేదు.

శ్రీరామచంద్రుఁడు తనవెంట వత్తు నని పలికిన సీతతో 'నరణ్యములలో వసింపవలెను సుమా' యని పలుకఁగా నామె 'అడవులు నాకు మేడువులే అవుతవి సుమండీ' యని పలికియుండెను. భర్త సన్నిధానవర్తిగా నుండుటయే రాజప్రాసాద నివాసమునకన్న మిన్న యయిన దని భావించినసీత పతిభక్తితత్పరత యెంతయుఁ గొనియాడఁ దగినది. అరణ్యములలో నామె యాశ్రమవృక్షములకు నీరు పోయుటకై వారిఘటమునుగూడఁ దాల్చినది. ఆశ్రమవృక్షములను దనబిడ్డలవలెఁ బెంచినది. అడవులలోఁ గష్టతర మయిన తపస్వివృత్తి నామె యవలంబించుట కామెపతిభక్తియే ప్రధానకారణము! సీతారాము లిరువురును 'తుల్యశీలు రగుదంపతులు'. శ్రీరామచంద్రుని హృదయము సీతకుఁ జక్కఁగాఁ దెలియును. దశరథుఁడు శ్రీరామచంద్రునిఁ బట్టాభిషిక్తుఁడవు కమ్మని కోరినపుడు తనజనకునితోఁ దానేమి పలికి యుండెడివాఁడో తెలుపు మని శ్రీరామచంద్రుఁడు కోరఁగా సీత శ్రీరామచంద్రుని హృదయమును జక్కఁగా నెఱిఁగియుండిన దగుటచేత నాతఁడాచరించినకార్యమును జరిగినది జరిగినట్లుగాఁ దెలుపఁగలిగెను. ఆమె యతనితో 'కార్యేషు మంత్రీ' యనువాక్యము యథార్థ మగునటులఁ గొన్నికొన్ని సందర్భములఁ గుటుంబవిషయములనుగూర్చియు నింకను నితరవిషయములనుగూర్చియుఁ జర్చించును. శ్రీరామచంద్రుఁడు దుఃఖితుఁడుగా నున్నపు డతని నోదార్చును. తనచెలికత్తెలు తప్పు చేయుట నామె సహింపదు. అవదాతిక కైకమ్మగారికిఁ దెలియకుండ నారచీరను జించుకొని వచ్చిన దని తెలిసి నవ్వుచు 'తప్పుపని చేసినావు. పో. ఇచ్చిరా' యని యామె యవదాతికను మందలించును.

సీతకుఁ దనమామగా రయినదశరథమహారాజుగారి యెడల విశేషభక్తిగౌరవములు కలవు. ఆమె శ్రీరామచంద్రునికిఁ బట్టాభిషేకము జరుగనున్న దని వినినపుడు 'తండ్రిగారు క్షేమముగా నున్నారా' యని ప్రశ్నించును. మహారాజులుండగారే స్వయముగాఁ బట్టము గట్టుచున్నా రని తెలిసిన తరువాతనే యామె శ్రీరాముని పట్టాభిషేకమునెడ నుత్సాహము

ప్రకటించును. అప్పుడు కూడ దశరథుఁడు శ్రీరామచంద్రునికిఁ బట్టము గట్టి యడవులకుఁ బోవుట యామె కిష్టము లేదు. 'దశరథుఁడు శ్రీరామచంద్రునికిఁ బట్టము గట్టి యడవులకు వెడలు నఁట' యని చేటి పలుకఁగా 'అయితే యీయుదకము రాజ్యాభిషేకము కోసము కాదు. కన్నీటిముఖము కడుగుకొనడముకే' యని యామె వచించును. మంథర 'జేనిచెవిలో నెదో వచించుట' చేతఁ దన పట్టాభిషేక మాగిపోయిన దని శ్రీరామచంద్రుఁడు చెప్పఁగా సీత విచార మందుటకు బదులు మహారాజులుంగారు మహారాజులుంగారుగానే యార్యపుత్త్రు లార్యపుత్త్రులుగానే యుందు రని మిక్కిలి సంతోషించెను. భరతునిరాజ్యాభిషేకమును గూర్చి విన్నప్పుడు కూడ నామె గుండెయాందోళనమును జెందలేదు. ఏలయన 'రాజస్థానములు బహుగడబిడలతో ఉంటవి' యని యామెకు బాగుగాఁ దెలియును. శ్రీరామచంద్రుఁడు పదునాలుగేండ్లర ణ్యవాసము చేయవలయు నని కైకేయి కోరినట్లు లక్ష్మణుఁడు తెలిపినపుడు కూడ నామె యెవరిని గాని దూషింప దయ్యెను. అట్టిదురవస్థ వచ్చెనదిగదా యని యామె విచారముమాత్ర మందెను.

శ్రీరామచంద్రునివెంటఁ దాను గూడ వచ్చుట కనుమతింపవలసిన దని లక్ష్మణుఁడు కోరినపుడు శ్రీరామచంద్రునితో నీమెయు నాతని వారించును. కానియాతని చిత్తశుద్ధిని, సోదరభక్తిని గాంచి దయార్ద్రచిత్తయై యాతఁడు గూడఁ దమవెంట వచ్చుట కనుమతింప వలసిన దని యామె శ్రీరామచంద్రునిఁ బ్రార్థించును. సీతారామలక్ష్మణు లరణ్యములో నివసించుచుండఁగా భరతుఁడు శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి యాతని నెట్లయిన నయోధ్యకుఁ గొని తేవలయు నని పోయి యాతనిఁ బ్రార్థింపఁగా శ్రీరామచంద్రుఁడు పితృవాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చి యయోధ్యకు వచ్చుటకు నిరాకరించును. అప్పుడు సీత సౌఖ్యము గలిగించుకొని భరతునిపక్షమున మాటలాడి యాతనిఁ గరుణింప వేఁడును. 'భరతుఁడు కడుజాలిగా ఆకాగుకొంటున్నాఁడు. మీరేమి యోచిస్తున్నారు.' అని యామె శ్రీరామ

చంద్రునితో ననును. రామాయణమున మాయామృగమును వెన్నంటి పోయిన శ్రీరామచంద్రుని రక్షించుటకై లక్ష్మణుఁడు పోవ నిరాకరించె నని సీత యాతని ననేకవిధములఁ దూలనాడును. కాని ప్రతిమానాటకమున నాసమయమున లక్ష్మణుఁడు తీర్థయాత్రనుండి మరలి వచ్చుచుండిన మునికులపతి నెదురుకొని కొనితెచ్చుటకై పోయియుండె నని తెలుపఁబడియున్నది. ఇందుచే

సీత శీలము కళంకితము గాక మహోజ్జ్వలముగా వెలుఁగొందుచున్నది. సీత యాశ్రమవృక్షములను దనబిడ్డలవలెఁ బెంచుచుండె ననువిషయము పంచమాంకమునందలి శ్రీరామచంద్రుని పలుకులవలన మనకుఁ దెలియవచ్చుచున్నది.

'కామినులమాడ్కి నీకుఁ గడుఁ గూ
ర్పగు జింకలతోడ, నెయ్యపుం
ద్రుమములతోడ, వింధ్యవనితోఁ జె
లికత్తియ లాలతాళితో
హిమగిరికాననంబుల సమిద్ధమ
హౌషధిదీపితంబులం
దమర వసింప నేఁగుదు మ
టంచు వచించి యనుజ్ఞఁ బొందుమా'

యని శ్రీరామచంద్రుఁడు పలికినవాక్యములనుబట్టి సీత యాశ్రమమృగములయెడను, వృక్షములయెడను నెంత ప్రేమముతో నుండెనో వెల్లడి యగుచున్నది.

జనస్థానమునందలి తాపసాంగనలకడ నీమెకుఁ జనవు విశేషముగాఁ గలదు. వారెల్లరు నీమెను

'చెలి! కోడల! బిడ్డా! మై
థిలి! యని వయసునకుఁ దగిన తెఱఁగుచనవునన్'
పిలుచుచుందురఁట!

తపస్విజనుల మన్ననలకుఁ బాత్రురా లయినజానకి ఈదశకు సప్తమాంకమున జనస్థానమునందు మునిజనసమక్షమున శ్రీరామచంద్రునితో బాటు పట్టాభిషిక్తయై రాజ్ఞీపదముఁ దాల్చినది.

సీత శ్రీరామచంద్రుని 'మేనిలో సగము!' అతని 'కవస్థా కుటుంబిని!' మర్త్యకాంతలలో నరుంధతీసతి! సేవకులు తప్పు సేయుట సైపనియజమానురాలు! మఱఁదులయెడఁ బ్రేమము గల యుత్తమ వధూనిక! దశరథుని క్షేమమునే ప్రధానముగా నెంచు దొడ్డకోడలు! కష్టములను గలకల లాడుమొగముతో స్వీకరించుక్షమామూర్తి! తపస్వి కాంతల మన్ననలకుఁ బాత్రురా లయినయుత్తమతపస్వి! తన పడరాని కష్టముల ఫలముగా రాజ్ఞీపదము నధిష్ఠించినసీత యాదర్శభారత గృహిణి! భారతీయత మూర్తీభవించినవనితారత్నమును సీతలోఁ జిత్రించి భాసుఁడు సీతపాత్రము నద్భుతముగాఁ దీర్చినాఁడు!

## లక్ష్మణుని శీలము

సుమంత్రుఁడు పలికినట్లు భక్తియే రూపముఁ దాల్చె ననఁదగిన లక్ష్మణుఁడు శ్రీరామచంద్రునికిఁ గడుఁ గూర్చు తమ్ముఁడు. భరతుని మాటలలో నితఁడు 'నిష్కారణావసితవనవాస మగుసౌభ్రాత్రము'! 'పగలు రేయి రామచంద్రమూర్తి రఘువంశదీపకు నీడవోలె నతఁడు వీడకుండు'ను. అతఁ డెప్పుడును భ్రాతృసేవైక తత్పరచిత్తవృత్తి!

లక్ష్మణుని సోదరప్రేమ నిరుపమానము. దానిని ప్రేమ యనుటకన్న భక్తి యనుట లెస్స. శ్రీరామచంద్రుని కపకారము జరగుట నతఁ డావంతయు సహింపజాలఁడు. శ్రీరామచంద్రుని పట్టాభిషేకము కైకదుశ్చింతవలన నాగి పోయిన దని తెలిసి యాతఁ డగ్ని యయ్యెను. 'తాల్పుము విల్లు జేనిపరితాపము సైపనిచో దయామతిజ్ఞ గొల్పకు' మని యాతఁడు శ్రీరామచంద్రుని కడకు వచ్చెను. అపుడు శ్రీరామచంద్రునికి 'కోపగించి యతఁడు మాఁపట్టఁగా నెట్టయెదుటఁ బోఁచె నూర్గురేమొ యనఁగ'. శ్రీరామ

చంద్రుఁ డనుజ్ఞ దెలిపినయెడల లోకమం దాఁడుపుర్వులను దుల్పెద నని యాతఁ డనును. శ్రీరామచంద్రునికి రాజ్యము లేకపోయినందుల కాతనికిఁ జింత లేదు. కాని యాతఁడు పదునాలుగేండ్లు వనవాసము చేయవలయు నని కైక కోరినందుల కాతఁ డుగ్రుఁ డయ్యెను. లలాటపుటమున నతఁడు దాల్చినభ్రూముడి 'మూఁడులోకములను ముట్టించి యొకపెట్ట తగులఁ బెట్టఁ గలదు'!

సీతారాముల కిరువురకును నితనిపై వాత్సల్యము మెండు. శ్రీరామచంద్రుఁడు తాను గైసేయువస్త్రభూషణ మాల్యాదివస్తువులలో నీతనికిఁ జక్క సగ మిచ్చుచుండును. శ్రీరామచంద్రుఁడు పితృవాక్యమును బరిపాలించుటకై యరణ్యముల కేఁగ నిశ్చయించుకొనఁగా సీతయు నాతని వెంట వచ్చుట కనుమతింపు మని యాతని వేఁడును. అపు డాతఁ డామెను వారింపు మని లక్ష్మణునిఁ గోరును. లక్ష్మణుఁడు సతీమణి భర్తృవ్యసనాథ యని వచించి యామె నాతని వెంటఁ గొంపోవుటయే ధర్మ మని చెప్పును. మఱియు నాతఁడు శ్రీరామచంద్రుని వెంట నరణ్యములకుఁ బోయి యాతనికి శుశ్రూషింపఁ దలఁచును. తనకును వల్కలము నిమ్మని శ్రీరామచంద్రునిఁ బ్రార్థించును. కాని యాతఁడు నిరాకరింపఁగా

'అమ్మ నీ కొక్కరికతకె మాయన్నగారి
యడుగుఁదమ్ముల సేవింప నాస్థ యగునె
కుడియడుగు నీకె యగుఁ గాక యెడమయడుగు
పడయఁగా నిమ్ము న; న్నెడమడుగు వలదు.'

అని సీతను బ్రార్థించును. ఆమె శ్రీరామచంద్రు నంగీకరింపఁ జేయును. అడవులలో లక్ష్మణుఁడు శ్రీరామచంద్రునకు శుశ్రూష సలుపుచు భక్తి నెఱపుచుండెను. భరతుఁడు వచ్చినప్పుడు మాత్రము లక్ష్మణునిశుశ్రూష యొకింత సడలినది.

భరతునియెడల లక్ష్మణునికి మిక్కిలి వాత్సల్యము. చతుర్థాంకమున భరతుఁడు సీతారాము లున్నతపోవనమునకు వచ్చినపుడు లక్ష్మణుఁడు

రామాయణములోవలె నతని గూర్చి నిందావాక్యము లాడక యాతిథ్యము హృదయపూర్వకముగా నాహ్వానించును. మఱియు నిందు రావణుఁడు పరివ్రాజక వేషమున వచ్చినపు డీతఁడు తీర్థయాత్రనుండి తిరిగి వచ్చుచుండిన మునికులపతి నెదురుకొని కొని తెచ్చుటకుఁ బోయి యుండినందున నాసమయమున నం దాశ్రమమున లేకుండెను. ఇందుచే రామాయణమునందువలె సీత యితనిని నిందావాక్యము లాడునసందర్భము తొలఁగినది.

శ్రీరామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁ డగుట యాతనికిఁ బరమానంద ప్రదము. అది తమయదృష్టముగానే యాతఁడు భావించెను. రాజ్యము నధిగమించిన శ్రీరామచంద్రునితో నాతఁడు 'మాయదృష్టమున మీ రిప్పటికి అలరారుచున్నారు' అని పలికి యుండుట యింగులకు నిదర్శనము.

శ్రీరామచంద్రుని సోదరుఁ గల నిరుపమానభక్తిచే లక్ష్మణుఁడు పితృప్రేమముతోఁ బాటు రాజ్యసౌఖ్యమును గూడ విడనాడి యరణ్యములలో నివసించుటకు స్వచ్ఛందముగాఁ గోరుకొనుట యెంతయుఁ బ్రశంసనీయము. లక్ష్మణుఁడు త్యాగమూర్తి! భక్తిప్రోవు!

## ప్రతిమానాటకమునందలి కొన్ని ప్రధానకల్పనములు- వాని ప్రయోజనములు

భాసమహాకవి సంస్కృతనాటకకర్తలలో నగ్రగణ్యుఁడు. ప్రపంచ మెంతయు నజ్ఞానతమోమయమై యుండినకాలమున భాసమహాకవివంటి యొక గొప్పకవీశ్వరుఁడు, నాటకకర్త వెలయుట భారతదేశమునకు గర్వకారణము. భాసుఁడు తనరూపకములకు స్వకపోలకల్పనములచే నొకసహజరామణీయకమును గలుగఁజేసి నాటకప్రపంచమునందే యఖండఖ్యాతిని గడించినాఁడు. అతని నాటకములు సాధారణముగాఁ బ్రసిద్ధేతివృత్తములతోఁ గూడియున్నను, నాటకోచిత ప్రభావముకొఱకై యతఁడు వానియందుఁ గొన్ని యపూర్వము లయినకల్పనములను గావించియున్నాఁడు. అందులోఁ బ్రతిమానాటకమునందుఁ బ్రథమాంకమునందలి వల్కలకల్పనము,

తృతీయాంకమునందలి ప్రతిమాకల్పనము, పంచమాంకమునందలి దశరథ శ్రాద్ధకల్పనము ననునవి ప్రధానము లైనవి.

డాక్టరు పుసల్కరు మహాశయుఁడు ప్రతిమానాటకమునందలి కల్పనములనుగుఱించి యిట్లు వక్కాణించి యున్నాఁడు. "వాల్మీకిరామాయణమును జదివినవాఁ డీనాటకమును జదువుట తటస్థించినచో నతఁ డీనాటకమునందలి యితివృత్తము దేనిమీఁద నాధారపడియున్నదో చెప్పఁ జాలఁ డనుట యథార్థము. ఇందులోఁ బ్రతియంకమునందును నూతన కల్పనములు గలవు. నాటకమున నాయకుఁడు ధీరోదాత్తుఁడుగా నుండ వలయు ననియు, నతనిశీలము కలుషిత మైనదానిఁగాఁ జిత్రింపరా దనియు నియమము నుండుటచేత భాసమహాకవి తననాటకమునందలి పాత్రలయోగ్యతలను సంపాదించుటకై నూతనకల్పనములను గావించుట తప్పనిసరి యాయినది."

ప్రతిమానాటకమునందలి ప్రధానకల్పనములును, నాటకమున నాకల్పనములవలనఁ గలప్రయోజనములును నెట్టివో యిందుఁ బరిశీలింతము.

వల్కలకల్పనము—

ప్రతిమానాటకమునఁ బ్రథమాంకప్రారంభమునందు స్థాపన ముగిసిన పిమ్మట విజయ యనుపరిచారిక రంగస్థలముమీఁదికి వేతెంచి, శ్రీరామ చంద్రుని యభిషేకమునకై యభిషేకసంభారములను శీఘ్రముగా నాయత్త పఱుపవలసిన దని దశరథమహారాజులుంగారు ఆజ్ఞాపించినట్లు కాంచుకీయు నకుఁ దెలుపును. పిదపఁ బూజ్యు లయినపురోహితులను నాహ్వానించి రమ్మని సంభవకుఁ డనుపరిచారకునిఁ బంపి, సందర్భోచిత మగునాటక మాడవలసి నదిగా నాటకరంగాలంకారములను దీర్చు రేవమ్మగారికిఁ జెప్పవలసిన దని యామెకడకు సారసిక యనుపరిచారికను బంపి తాను నిష్క్రమించును.

అంత నవదాతిక యనుచేటి ప్రవేశించును. ఆమె నాటకాల రేవమ్మ గారిని' పని తీరిపోయినవి. అశోకపు చిగురుటాకులు ఉంటేను నా కిమ్మని

యాచించినది. కాని రేవమ్మ 'వల్లకా' దనెను. అవదాతిక యామె 'పస
పట్టించుటకై' కొన్ని యశోకపు చిగురుటాకులను దొంగతనముగా చింపు
కొని వచ్చెను. కాని యామె మనసు తప్పుఁ జేయుటచేఁ గాఁబోలు కల
వరము నొందియుండెను. ఎంత ప్రయత్నించినను నామెకు నగుమోము
రాలేదు. ఇంతలో సీత సపరివారముగా నచ్చటి కరుదెంచి ముఖకవళికలను
బట్టి యవదాతిక యేదో తప్పుఁ జేసియుండు నని గుర్తించి యామె నడిగి
విషయము తెలిసికొని 'వెఱ్ఱిదానా! ఇట్లాగే తప్పులు పెరుగుతవి. వెళ్లు.
ఇచ్చివేయి.' అని యామెను మందలించును. అవదాతికయుఁ దనకడ నున్న
నారచీరను బయలుగాఁ బట్టుకొని పోవుచుండును. సీత యావల్కలమును
వీక్షించి దానిని ధరింపవలయు నని తనమనసులోఁ గోరిక జనింపఁగా నది
యడిగి పుచ్చుకొని తాను ధరించును. ఇంతలో శ్రీరామచంద్రుఁ డచ్చటికి
వచ్చి వల్కలమును ధరించియున్న సీతనుం గని 'యిక్ష్వాకువంశమువారి
ముసలితనపు టలంకారము నేల ధరించితి' వని యామెను ప్రశ్నించును.

ఇది వల్కలకల్పనము. రామాయణమునందు లేని యీ కల్పనమును
భాసమహాకవి తన నాటకమున నేల ప్రవేశపెట్టెనో యించుక యరయవలసి
యున్నది.

ప్రథమాంకాంతమున శ్రీరామచంద్రుఁడు తనసోదరుఁ డగులక్ష్మ
ణునితోడను, దనభార్య యగుసీతాదేవితోడను పితృవాక్య పరిపాలనార్థ
మరణ్యముల కేఁగును. జరుగనున్న దుస్సంఘటనను ప్రేక్షకులకు ముందుగానే
సూచించుటకో యనునట్లుగా భాసమహాకవి యీయపూర్వకల్పనమును
గావించియున్నాఁడు. ఇది తరువాత జరుగఁబోవు దుఃఖకరసన్నివేశమునకుఁ
బ్రేక్షకులను ముందుగానే సిద్ధముఁ జేసియుంచుటకుఁ దోడ్పడుచు నాట
కోచిత మయినప్రభావముతో నొప్పి మనోహరమై భాసునికల్పనా సామ
ర్థ్యమును వెల్లడిచేయుచున్నది.

ప్రతిమాకల్పనము-

ప్రతిమానాటకమునందలి తృతీయాంకమున నీకల్పనము గలదు. ఈ నాటకమునకే తృతీయాంకము శిరోమణివంటిది.

భరతుఁడు చాలనాళ్ళనుండి తనమేనమామగారియింట నుండుటచే నాతనికి నయోధ్యలో జరిగినవిషయము లేవియుఁ దెలియ వయ్యెను. దశరథ మహారాజులుంగారు మరణించినపిదప వసిష్ఠవామదేవులు, సుమంత్రుఁడు మహారాజులుంగా రస్వస్థశరీరులుగా నున్నారని భరతునికి వార్తఁ బంపుదురు. భరతుఁడు తనజనకునిఁ జూడఁగోరి రథారూఢుఁడై యయోధ్యాభిముఖముగా వచ్చుచుండును. అతఁ డయోధ్యానగర బాహ్యప్రదేశముఁ జేరుసరికి నొకభటుఁ డతనికడకు వచ్చి 'కృత్తికానక్షత్ర మింక నొక్క గడియ గలదు. కావున నీగడియ గడచి రోహిణీనక్షత్రము వచ్చినతరువాత నగరప్రవేశముఁ జేయవచ్చు' నని వసిష్ఠులవా రాజ్ఞాపించినట్లు తెలుపును. అంత నాతఁడు విశ్రాంతియు, దేవపూజయుఁ గలిసివచ్చు నని యచ్చట దేవాలయమును బోలియున్న యొక మందిరముఁలోనికిఁ బ్రవేశించును. అది యిక్ష్వాకులప్రతిమలు నిలిపియున్న ప్రతిమాగృహము గాని దేవాలయము గాదు. అతఁ డందుఁ బ్రవేశించుసరికి నచ్చటి ప్రతిమాగృహరక్షకుఁ డచ్చట లేకుండెను. అక్కడ నున్నప్రతిమలను జూచి యతఁ డవి చతుర్దైవతస్తోము మని తలపోసి వానికి నమస్కరింపఁబోవును. ఇంతలో క్షత్రియప్రతిమ లని తెలియక బ్రాహ్మణజనము నమస్కరించుచుండె నని యా పరిచారకుఁ డతని వారించును. అవి క్షత్రియులప్రతిమ లనియు, నిక్ష్వాకుల వనియు నాతఁడు భరతునికిఁ దెలుపును. భరతుఁ డిక్ష్వాకువంశ్యుల ప్రతిమలను దర్శింపఁ గలుగుటకు మిక్కిలి సంతోషించి వారలొక్కొక్కరు నెవరెవరో యెఱుఁగఁగోరును. అంత దేవకులికుఁడు వరుసగా దిలీప, రఘు, అజ మహారాజులప్రతిమలను జూపును. వానిని జూచినతరువాత నాప్రతిమల ప్రక్కనే యుండిన దశరథునిప్రతిమను గాంచి భరతుఁ డాందోళన

మందును. అతఁడు దశరథప్రతిమనుగూర్చి యనేకప్రశ్న లడుగును. తరువాత మృతు లయినవారి ప్రతిమలుమాత్రమే ప్రతిమాగృహమున నిలుపఁబడు నని దేవకులికు నడిగి తెలిసికొని భరతుఁడు మిక్కిలి యాందోళన మందును. అపుడు దేవకులికుఁడు దశరథుని ప్రతిమనుగూర్చి యతఁ డడుగకుండుటకుఁ గారణ మేమని ప్రశ్నించును. పిదప నాతఁడే దశరథుఁడు మరణించిన ట్లెఱిఁగించును. భరతుఁ డప్పుడు దశరథుని మరణ వృత్తాంతమును దెలిసికొని సవిస్తరముగా నావిషయమును దెలుపవలసిన దని దేవకులికుని నొత్తిడి సేయును. దేవకులికునివలన సీతాలక్ష్మణసహితుఁడై శ్రీరామచంద్రుఁ డరణ్యములకుఁ బోయె నని తెలిసికొని భరతుఁడు మూర్ఛ నొందును. ఈ దుస్థితి కంతకును దనతల్లి యగుకైకేయి దుశ్చింతయే మూల మనియు, నామెకు వివాహసమయమున దశరథుఁ డొసఁగియుండిన వరములే యిప్పటి దురవస్థకుఁ బ్రధానహేతు వనియు భరతుఁడు గ్రహించి యావిషయమునే తలపోయుచుఁ దిరిగి మూర్ఛలో మునుఁగును.

ఇంతలో రాణులును సుమంత్రుఁడును బ్రవేశించి మూర్ఛితుఁడై పడియుండిన భరతునికి శీతలోపచారములు సేయుదురు. భరతుఁడు మూర్ఛ నుండి క్రమముగాఁ దేరుకొని సుమంత్రుని గుర్తించి, రాణులను జూచి, యందుఁ గౌసల్యా సుమిత్రలకుమాత్రము నమస్కరించును. పిదప నతఁడు తనతల్లి యగుకైకేయిని జూచి కుపితుఁడై యామె తనకుఁ దల్లియే కాదని యామెకు నమస్కరింప నిరాకరించును. వసిష్ఠాదులు ప్రకృతులతో నరుగుదెంచి రాజ్యాభిషేకము నంగీకరింపవలసిన దని కోరఁగా భరతుఁడు రాజ్యాభిషేకమును దిరస్కరించును. అతఁ డడవుల కేఁగి, శ్రీరామచంద్రుని దర్శించి, యాతనిఁ బ్రార్థించి, తిరిగి యాతని నయోధ్యకుఁ గొని తేవలయు నని నిశ్చయించుకొనును.

ఇందుఁ బ్రతిమాగృహమున నెలకొలుపఁబడిన దశరథప్రతిమను జూచి భరతుఁడు తనజనకుఁ డగుదశరథుని మరణవృత్తాంతమును దెలిసికొను

చున్నాఁడు. ఇదియే ప్రతిమాకల్పనము. ఈ కల్పనమునుబట్టియే ప్రతిమా నాటక మని యీ నాటకమునకుఁ బే రయ్యెను.

దశరథశ్రాద్ధకల్పనము–

ప్రతిమానాటకమునఁ బంచమాంకమునందు దశరథ శ్రాద్ధ కల్పనము గలదు. ఆ కల్పన మెట్టిదో, యది నాటకమున నెట్టి ప్రయోజనమును సాధించుచున్నదో యించుక విచారింతము.

చతుర్థాంకము కడపట భరతుఁడు శ్రీరాము నడిగి యతని పాదుకలను గ్రహించి యయోధ్యానగరమునకు మరలి పోవును. అంత శ్రీరాముఁడు కొన్ని దినము లయినపిదపఁ దనతండ్రి యగుదశరథుని యనుసంవత్సరశ్రాద్ధ విధి నెట్లు నిర్వర్తించుటా యని చింతించుచు నావిషయమున సీతాదేవితో మంతన మాడఁ గోరి యాశ్రమములోనికి వచ్చును. ఆ సమయమున సీతయు నాశ్రమమునందలి గున్న చెట్లకు నీరు పోయుచుండును. సీత శ్రీరామచంద్రునిఁ జూచి, యాతఁ డేదో వ్యాకులచిత్తుఁడై యున్నట్లాతనిముఖము తోఁపఁ జేయుచుండుటచే నతనివిచారమునకుఁ గారణ మే మని యాతనిఁ బ్రశ్నించును. శ్రీరామచంద్రుఁ డామఱునాఁడు జరుగవలసియుండిన తనతండ్రిగారి శ్రాద్ధవిషయమును బ్రస్తావించి తండ్రిగారి కుచిత మయిన తెఱఁగునఁ బిండ ప్రదానముఁ జేయఁజాలకపోయితిని గదా యని విచార మందుచుండును. ఇంతలో రావణుఁడు పరివ్రాజకవేషముతో నా యాశ్రమమునకు వచ్చును. అతనిఁ గాంచినతోడనే శ్రీరామచంద్రుఁడు 'అతిథికి స్వాగత' మని వచించును. అంతకు మునుపే శ్రీరామచంద్రుని రూపమును విలోకించిన రావణుఁ డాతని మధురకంఠధ్వని విని స్వాభావిక మగురూపసౌందర్యము స్వరసౌభాగ్యముచే నిబ్బడి యయ్యెను గదా యని పలుకును. శ్రీరామ చంద్రుఁ డాతనికి శుశ్రూష సేయ యత్నింపఁగా నాతఁడు మాయాప్రకాశనపర్యాకులుఁడై యతని నా ప్రయత్నమునుండి వారించును. అంత రావణుఁడు బ్రాహ్మణసముదాచారము ననుష్ఠించి తాను నేర్చినశాస్త్రముల

నెల్లఁ బేర్కొని ప్రాచేతసశ్రాద్ధకల్పమును గూడఁ దా నధ్యయనముఁ జేసినట్లు తెలుపును. శ్రీరామచంద్రుఁడు శ్రాద్ధకల్పమువిషయమై శ్రద్ధఁ జూపుచుఁ పిండప్రదానకాలమందుఁ బితరులను దేనిచేఁ దృప్తిపఱుపఁ గలుగుదును? అని యాతనిఁ బ్రశ్నించును. అందులకు రావణుఁడు శ్రాద్ధమునకు శ్రేష్ఠములైనకొన్నివస్తువులను వరుసగాఁ బేర్కొని 'ఐనను' అని యనును. రాముఁడంత 'ఐనను' అనుటచే నింకను నేదో యున్న దని యడుగఁగా నాతఁడది ప్రభావసంపాద్య మని బదులు చెప్పును. శ్రీరామచంద్రుఁ డది ప్రభావసంపాద్య మైనను నదేదో తన కెఱిఁగింపవలసిన దని కోరుచుఁ 'దపసు చాలని దైనను ధనువు గలుగు, ధనువు చాలని దైనను దపసు గలుగు' అని వచించును. అంత రావణుఁడు కాంచనపార్శ్వమృగములు శ్రాద్ధమునకు శ్రేష్ఠము లని వచించి యవి మంచుకొండచరియలయందు నివసించు నని తెలుపును. శ్రీరామచంద్రుఁడును నామృగములను దెచ్చుటకై హిమాలయములకు బ్రయాణము కట్టును. కాని యింతలో రావణుని మాయచే నచటికే కాంచనపార్శ్వమృగము వచ్చును. అంత శ్రీరామచంద్రుఁడది తనతండ్రిగారి భాగ్య మని వచించి, మైథిలితో లక్ష్మణున కామాట తెలుపు మని యానతిఁ బెట్టును. కాని మైథిలి తీర్థయాత్రనుండి తిరిగివచ్చుచున్న మునికులపతి నెదురుకొనుటకై లక్ష్మణుఁడు పోయి యున్నాఁడని తెలుపును. అంత రాముఁడు కాంచనపార్శ్వమృగమును దెచ్చుటకై తా నే స్వయముగా బయలుదేరును. శ్రీరామచంద్రుఁ డాశ్రమమును వీడి చన్నపిదప రావణుఁడు సీత నపహరించుకొని పోవును.

ఇది దశరథశ్రాద్ధకల్పనము. ఈ కల్పనము వాల్మీకి రామాయణమునందుఁ గానవచ్చుట లేదు. రామాయణమునందు సీతముచ్చట దీర్చుటకై శ్రీరామచంద్రుఁడు మాయలేడిని వేఁ బోవును. అందుచే శ్రీరామచంద్రుని శీలము కొంత కళంకిత మగుచున్నది. ఇది గాక శ్రీరామచంద్రుఁడు చన్నపిదప రావణుఁడు వచ్చులోపల సీత మాయలేడి యార్తనాదము విని యది శ్రీరామచంద్రునిదే యని తలఁచి లక్ష్మణు నాతనిసహాయార్థము పొమ్మనును.

అతఁడు శ్రీరామచంద్రుని పరాక్రమమును జక్కఁగా నెఱిఁగియుండినవాఁ డగుటచేఁ దాను బోవలసిన యవసరములే దని తెలుపఁగా సీత యతని మిక్కిలి నీచముగాఁ దూలనాడును. ఈ కల్పనమువలన సీత లక్ష్మణునిఁ దూలనాడకుండుట సిద్ధించుచున్నది. ఇందుచే సీతశీలము కూడ నుదాత్తముగాఁ బోషిత మగుచున్నది. ఇది గాక శ్రీరామచంద్రుని పితృభక్తిగూడ నీకల్పనమువలన నినుమడింపజేయఁ బడుచున్నది. కనుక నీ కల్పనమువలన రామాయణమునందలి శ్రీరామచంద్రునికిఁ గల భార్యాలోలత్వ మనుదోషము పరిహరింపఁబడి యతని పితృభక్తి యినుమడింపఁబడఁ జేయుటచే శ్రీరామచంద్రుని శీలమున కుదాత్తతయు, రామాయణమునందువలె సీత లక్ష్మణుని నిందింపకుండుటచే సీతశీలమున కుదాత్తతయు నిందుమూలమునఁ జేకూడుచున్నవి.

## నాటకలక్షణములు

### దశవిధరూపకములు—

నాటకమునకు నాట్యము, రూపము, రూపకము ననునవి నామాంతరములు. అందు రూపకము – నటునియందు రామాది నాయకత్వమును నారోపించుటచేత నది రూపక మనఁ బడుచున్నది. ఇది శృంగారాదిరసముల నాశ్రయించి యొప్పుచుండును. రూపకము– 1. నాటకము 2. ప్రకరణము 3. భాణము 4. ప్రహసనము 5. డిమము 6. వ్యాయోగము 7. సమవకారము 8. వీధి 9. అంకము 10. ఈహామృగము అని పదివిధములు. వీనికి దశవిధరూపకము లని పేరు. వీనిలో నాటకము తక్కినరూపకముల కన్నిటికిని బ్రకృతియై సంపూర్ణలక్షణము గలిగి వెలయుచున్నది.

### సూత్రధారుఁడు—

సూత్ర మనఁగా సబీజక మగునాట్యానుష్ఠానము. దానిని బ్రవర్తింపఁ జేయువాఁడు సూత్రధారుఁడు.

పూర్వరంగము—

పూర్వరంగ మనఁగా నాట్యశాల. దానియందు నిర్విఘ్నముగా నాట్యప్రదర్శనము జరుగుటకై రూపకాదియందుఁ జేయఁదగినకృత్యవిశేషము పూర్వరంగ మనఁబడును.

నాంది—

నాటకమునందు దీనికి (పూర్వరంగమునకు) నిరువది రెం డంగములు గలవు. వానిలో ముఖ్యముగా విఘ్నశాంతికై చేయఁ దగినది నాంది. ఆశీర్నమస్క్రియాదిరూప మగుమంగళాచరణము నాంది యనఁబడును. ఇది యెనిమిది గాని, పండ్రెండు గాని, పదునెనిమిది గాని, యిరువదిరెండు గాని పదములతోఁ గూడి యర్థముచేఁ గాని, శబ్దముచేఁ గాని కొంచెముగాఁ గావ్యార్థమును సూచించునదిగా నుండవలయును.

ఇట్టి నాందీరూప మగుపూర్వరంగ మొనరించి సూత్రధారుఁడు వెడలినపిదప నాకారగుణములయందు వానిని బోలిన యింకొకనటుఁ డానామముతోనే రంగభూమిని బ్రవేశించి కావ్యార్థసూచనముఁ జేయవలయును. దీనిని బట్టి సూత్రధారు లిద్ద ఱనియు, నం దొకఁడు పూర్వరంగప్రవర్తకుఁ డనియు, నటుఁడు, స్థాపకుఁడు నని పేరు గలరెండవ సూత్రధారుఁడు ప్రస్తావనాప్రవర్తకుఁ డనియుఁ దెలియవలయును. మొదటివానికి నాందీసూత్రధారుఁ డనియు, రెండవవానికిఁ బ్రస్తావనాసూత్రధారుఁ డనియుఁ గూడఁ బేళ్లు కలవు.

ఈసందర్భమున నాటకప్రారంభములయందుఁ గాన నగు 'నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి' యనుదానికి నాంది యొనరించి మొదటివాఁడు వెడలినపిదప రంగస్థలమునఁ బ్రవేశించినరెండవసూత్రధారుఁ డని తెలియవలయును. సాధారణముగా సంస్కృతనాటకములయందుఁ దొలుత నాందీశ్లోకమును, పిదప 'నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి' యను సూచనమును గాననగును. కాని భాసకృతులలో

నాందీశ్లోకమునకు ముందే పైసూచనము కొనవచ్చుచున్నది. ఇందుచే భాసకృతులలోని తొలిశ్లోకము నాందీశ్లోకము కాదనవలసి వచ్చును. కాని యీశ్లోకములందు నాందీశ్లోకలక్షణము గానవచ్చుచుండుట గమనార్హ మగుననువిషయము.

దివ్యమర్త్య మిశ్రరూపంబు లగు నితివృత్తములకుఁ దగిన యాకారాదులు గలవాఁ డగు రెండవ సూత్రధారుఁడు మొదటఁ గావ్యార్థ సూచకము లగు చక్కనిపద్యములచే రంగభూమిని రంజింపఁజేయుచు వస్తువు, పాత్రము, బీజము, ముఖము అనువానిలో నేదే నొకదానిని సూచించును.

ప్రతిమలో సూత్రధారుఁడు నటితోఁ గావించిన సంభాషణముతో రంగస్థలమును రంజింపఁజేసి పిదపఁ బ్రసంగవశమునఁ బ్రతీహారిపాత్రమును సూచించి నిష్క్రమించును.

ప్రస్తావన-

రెండవసూత్రధారుఁడు రంగస్థలమును రంజింపఁజేయుట మొదలుగా వస్తువు మొదలగువానిలో నొకదానిని సూచించి నిష్క్రమించువఱకుఁ గల యది ప్రస్తావన యనఁబడును. దీనికే 'యాముఖ' మనియుఁ బేరు. కొన్ని ప్రాచీనరూపకములలో- అనఁగా భాసనాటకములయందు-దీనికి 'స్థాపన' యను పేరు కనఁబడుచున్నది. భాసకృతులలోఁ గానఁబడు నీస్థాపన మిక్కిలి చిన్నదిగా నుండును. ఇతర నాటకములలో సాధారణముగాఁ బ్రస్తావనములయం దాదినమునఁ బ్రదర్శింపఁబడు నాటకమును గూర్చియు, దానిని రచించిన కవీశ్వరునిగూర్చియుఁ బ్రశంస యుండును. కాని భాసకృతులలోని స్థాపనలయం దట్టి ప్రస్తావ మేదియుఁ గానరాదు.

సూత్రధారుఁడు మారిషునితోఁ గాని, నటితోఁ గాని, విదూషకునితోఁ గాని ప్రస్తుతకథాసూచకముగాఁ దమకార్యముగూర్చి చిత్ర మైనసంభాషణ యొనరించుటయే ప్రస్తావన యనఁ బరఁగును. ఇందు మారిషునకు మార్షుఁడు, పారిపార్శ్వకుఁడు నని నామాంతరములు కలవు.

ప్రస్తావనాంగములు-

కథోద్ఘాతము, ప్రవృత్తకము, ప్రయోగాతిశయము అనునవి ప్రస్తావన కంగములు. ప్రస్తావనలయందు నిం దేదైన నొకటి యుండc దగును.

1. కథోద్ఘాతము :—సూత్రధారుని వాక్యములందుc బ్రస్తుత కథకుc గలియునట్టివాక్యమును గాని, దాని యర్థమును గాని గైకొని పాత్రము ప్రవేశించుట కథోద్ఘాత మనcబడును.

2. ప్రవృత్తకము :—ప్రస్తావనలోc బ్రవృత్త మైనఋతు సమాన గుణవర్ణనచే సూచింపcబడినపాత్రము ప్రవేశించుట ప్రవృత్తక మనc బడును.

3. ప్రయోగాతిశయము :—ఈ, ఇది, యీతcడు అని సూత్రధారునిచే నిర్దేశింపcబడిన పాత్రము ప్రవేశించుట ప్రయోగాతిశయ మనcబడును.

ప్రతిమలో స్థాపన యందుc 'బ్రవృత్తక' మను ప్రస్తావనాంగము కలదు. 'రాజసౌధమునంగ సంభ్రమముతో వర్తించుచున్న ప్రతీహారివలెc గాశవస్త్రములను దాల్చి హంసి సైకతములందు నడయాడుచుండును' అని శరత్కాలమునందలి హంసీసామ్యమున సూచింపcబడిన ప్రతీహారి పాత్రము రంగస్థలమునకుc బ్రవేశించుటచే నిటc బ్రవృత్తక మనcబడు ప్రస్తావనాంగము కల దని ఘంటాపథముగాc జెప్పcదగును.

విష్కంభము :—రంగస్థలముపైc బ్రత్యక్షముగాc జూపc గూడనికథావస్తువును విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకాస్యము, అంకావతారము అనునైదింటిచేత సూచింపc దగును.

జరగినవియు, జరగcబోవునవియు నగు కథాంశములను సంగ్రహముగాc దెలియcజేయుచు మధ్యమపాత్రలచేతc బ్రయోగింపc బడునది విష్కంభ మనcబడును.

విష్కంభము శుద్ధవిష్కంభ మనియు, మిశ్రవిష్కంభ మనియు రెండువిధములు. ఒకఁడు గాని, యిద్దఱు గాని మధ్యమపాత్రములను గలిగి యుండునది శుద్ధవిష్కంభము. మధ్యమాధమపాత్రములను గలిగి యుండునది మిశ్రవిష్కంభము. మిశ్రవిష్కంభమునకే సంకీర్ణవిష్కంభ మనియుఁ బేరు.

ప్రవేశకము :—ఇదియు విష్కంభమువలెనే జరగి నవియు, జరగఁబోవునవియు నగుకథాంశములను సంగ్రహముగాఁ దెలుపునదియై, యొకనిచేఁ గాని, యిద్దఱిచేఁ గాని నీచపాత్రములచేఁ బ్రయోగింపఁబడును. ఇది ప్రథమాంకప్రారంభమున నుండఁదగదు.

ప్రతిమానాటకమునఁ బ్రథమాంకప్రారంభమునందుఁ బ్రతీహారియుఁ గాంచుకీయుఁడును గావించినసంభాషణమును మిశ్రవిష్కంభ మనఁదగును. కాని నాటకమున నావిషయము పేర్కొనఁబడలేదు. ద్వితీయాంక ప్రారంభమునను, సప్తమాంక ప్రారంభమునను నున్నవిష్కంభములు మిశ్రవిష్కంభములు, షష్ఠాంకప్రారంభమున నున్న విష్కంభము శుద్ధ విష్కంభము. తృతీయాంకప్రారంభమునను, జతుర్థాంకప్రారంభమునను నున్నవి ప్రవేశకములు.

భరతవాక్యము :—ఇది నాటకాంతమునఁ గానఁబడు శుభాశంసనశ్లోకము. నాటకమునందలి ప్రధానపాత్రములలో నొకఁ డీ భరతవాక్యమును వచించును. భరతుఁ డనఁగా నటుఁ డని యిచట సామాన్యార్థము.

ప్రతిమానాటకాంతమున లక్ష్మణుఁడు భరతవాక్యమును బలుకును.

సీతతోడ బంధుజాతంబుతోఁ బొంది
పోసఁగి రాముఁ డుర్విఁ బ్రోచినట్లు
ప్రోచుఁ గాత మాతృభూమిని లక్ష్మీస
మేతుఁ డగుచు మామహీశ్వరుండు.

# సందర్భసహితవ్యాఖ్యలు

## (Annotations)

**1. చక్కనివారి కన్ని చక్కగానే ఉంటవి గాదండీ.**

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి ప్రథమాంకములోనిది.

అవదాతిక యనునొకపరిచారిక నాటకరంగాలంకారములను జాగ్రత్త పఱుచురేవమ్మగారిని 'పని తీరిపోయినవి. అశోకపు చిగురుటాకులు ఉంటేను నాకి' మ్మని యడిగెను. కాని యామె 'వల్లకా' దనెను. అందుచే నామెపని పట్టించుటకై యవదాతిక యామెకుఁ దెలియకుండ దొంగతనముగా నారచీరను జింపుకొని తీసికొనిపోవుచుండెను. అప్పుడు సీత సపరివారయై వచ్చుచుండి యవదాతిక తన్నుఁ జూచినంతనే వెలవెల పోవుచుండుటను గాంచి యామె యేదో తప్పుఁ జేసి యుండు నని గ్రహించి యామె నారచీర నెక్కడనుండి తీసికొని వచ్చితి వని యడుగును. అప్పుడామె జరిగినవిషయ మంతయు నివేదింపఁగా సీత యామెను మందలించి దానిని రేవమ్మగారి కిచ్చి రమ్మనును. అంత నవదాతిక యట్లే యని యానారచీరను బయలుగాఁ బట్టుకొని పోవుచుండఁగా సీత చూచి ముచ్చటపడి 'యిది నేను కట్టుకుంటె బాగుంటుందా' యని యవదాతిక నడుగును. అప్పు డవదాతిక పై వాక్యమును బలుకును.

చక్కనివారి కన్నియును జక్కగానే యుండును. చక్కని చుక్క యగుసీత నారచీర కట్టినను జక్కగానే యుండు నని భావము.

**2. తుల్యశీలు రగుదంపతులను బ్రహ్మ సకృత్తుగా సమకూర్చుచుండును.**

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి ప్రథమాంకములోనిది.

శ్రీరామచంద్రుఁ డభిషేకసమయమున ధరించుమంగళవస్త్రములతోఁ గాక మునుపటివేషముతోనే యుండుటను జూచి యవదాతిక యాతని

యభిషేకవిషయమై తాము విన్నది యబద్ధ మేమో యని సంశయించును. అపుడు సీత 'రాజస్థానములలో నెన్నో గడబిడ లుండును. అందుచే నభిషేక మాగిపోయి యుండును గాని మనము విన్నది యబద్ధము కా' దనును. ఇట్లు వీరు సంభాషించుచుండఁగా శ్రీరామచంద్రుఁ డది యే మనును. సీత యపు 'డీపిల్ల అభిషేకము అభిషేకము అని అంటున్నది' యనును. శ్రీరామ చంద్రుఁ డంతఁ దనయభిషేకవృత్తాంతమును సీతకుఁ జెప్పుచుఁ దనతండ్రి తన్నుఁ దనయంకమునఁ గూర్చుండఁ బెట్టుకొని 'నాయనా ! రామచంద్రా! నీ తల్లికడుపు చల్లగా నీవు రాజ్యమును గ్రహింపుమా' యని పలికె నని వచించును. అప్పుడు సీత 'మీ రేమి పలికితి' రనును. 'నే నేమి పలికి యుందునో నీవే చెప్పు' మని రాముఁ డనఁగా సీత 'ఆర్యపుత్రు లప్పుడు బదులు పలుకక నిట్టూర్పు విడిచి మహారాజులుంగారి పాదములపైని పడి ఉంటారని నే ననుకొంటాను' అనును. అది విని శ్రీరాముఁడు తా నట్లే గావించితి నని తెలుపుచుఁ బైవిధముగాఁ బలుకును.

సమానశీలము గలదంపతులను బ్రహ్మదేవుఁడు సకృత్తుగా (అరుదుగా) మాత్రమే సమకూర్చుచుండును. సీతారాము లిరువురును తుల్యశీలు రగుదంపతులు. అందుచేతనే సీత శ్రీరామచంద్రుఁ డాసమయమున నేమి చేసియుండునో చక్కఁగా నూహింపఁ గలిగినది. శ్రీరాముఁడు తనభార్యయు తనశీలమువంటి శీలము కలిగియున్నందులకు మిక్కిలి సంతోషించుటయే గాక బ్రహ్మదేవుఁ డట్టిదాంపత్యమును సకృత్తుగా మాత్రమే సమకూర్చుచుండు నని చెప్పి తమదాంపత్యమువంటి దాంపత్యము లోకములో నరు దని తెలుపుచున్నాఁడు.

3. నీ మనంబునకుఁ నచ్చిన దేది పాతకము నీమూఁడింటిలోఁ దమ్ముఁడా!

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి ప్రథమాంకములోనిది.

శ్రీరామచంద్రుని పట్టాభిషేకము భంగ మగుట తెలిసి లక్ష్మణుఁడు కోపోద్రిక్తుఁడై శ్రీరామచంద్రునికడకు వచ్చి తద్భంగమునకుఁ గారకు లగుబంధుజనమును విల్లు దాల్చి పరిమార్పవలసిన దనియు, నట్లు తాను జేయజాలఁకున్నఁ దన కనుజ్ఞ యిచ్చినచో లోకములో నొకయాఁడుపురుగు కూడ మిగులకుండునట్లు డులిపివైచెద ననియు వచించును. అతని కోపవచన ములను విని శ్రీరామచంద్రుఁ డుద్రిక్తుఁడు గాక మిక్కిలి శాంతచిత్తముతో నిట్లు వచించును. 'లక్ష్మణా! సత్యవ్రతుఁ డయినమనజనకుని వధించుటకు జాపమును సంధింపు మందువా? తనసొమ్మును దాను గోరుచున్న తల్లిని గైకేయిని వధించుట కస్త్రములు ప్రయోగింపు మందువా? అమాయకుఁ డును, నిష్కల్మషుఁడును నగు భరతుని సంహరింపు మందువా? ఈ మూఁడుపాతకములలో నీకు నచ్చిన దేదో చెప్పుము.'

పయికార్యములు మూఁడును పాపకార్యములే యని చెప్పుచు . ఆ మూఁడింటిలో నేది చేయు మందువో చెప్పు మని శ్రీరామచంద్రుఁడు లక్ష్మణు నడుగుటలో నతని మనోనిగ్రహమును, న్యాయశీలమును మనకు వ్యక్త మగుచున్నవి.

4. అడవులు నాకు మేడువులే అవుతవి సుమండీ.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి ప్రథమాంకములోనిది.

శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునివలనఁ దాను బదునాలుగేం డ్లరణ్య ములయందు వసింపవలసియున్న దని తెలిసికొని, పితృవాక్యమును బరిపా లించుటకై యరణ్యముల కేఁగఁ దలఁచును. సీతను బిలిచి యవదాతిక తెచ్చి యిచ్చిననారచీరలను దనకును గొని తెమ్మని యామెతోఁ జెప్పును. అపుడు సీత శ్రీరామచంద్రుని యరణ్యగమనవృత్తాంతము విని తా నాతని సహధర్మచారిణి యగుటచే నతనివెంటఁ బోఁ గోరును. శ్రీరామచంద్రుఁ డామె నాప్రయత్నమునుండి వారించుచు 'నాతో నీ వడవులలో వసింప

వలెను సుమా ' యనును. అందులకు సమాధానముగా శ్రీరామచంద్రునితో సీత పలికినవాక్య మిది.

అడవులు నాకు రాజప్రాసాదములే యగును సుమా! రాజప్రాసాదములయందు నా కెంత సౌఖ్యముగా నుండునో యడవులును-దమతోఁ గూడ నున్నచో-నంత సౌఖ్యముగా నుండు నని భావము.

మాడువులు = రాజభవనములు.

**5.** సతీమణి భర్తృసనాథయే కదా!

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి ప్రథమాంకములోనిది.

శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునివలనఁ దా నరణ్యములలోఁ బదునాలుగేండ్లు వసింపవలసి యున్న దని యెఱిఁగి పితృవాక్యపరిపాలనార్థ మరణ్యముల కేఁగఁ దలఁచును. అవదాతిక తెచ్చి యిచ్చిననారచీరలను దనకుఁ గూడఁ గొని తెమ్మని సీతతోఁ జెప్పును. శ్రీరామచంద్రుని వనగమనవృత్తాంతము తెలిసి సీత యాతనివెంటఁ దానును బోఁ గోరును. కాని శ్రీరామచంద్రుఁ డనేకవిధముల నామె నాప్రయత్నమునుండి వారింపఁ దలఁచును గాని యామె వినదయ్యెను. అపుడు చేయునది లేక శ్రీరామచంద్రుఁడు 'నీ వదినెను నివారింపు' మని లక్ష్మణునితోఁ జెప్పఁగా నాతఁడు తనసోదరునికి సమాధాన మొసఁగుచు నీవాక్యమును బలికెను.

రాహుగ్రహణకాలమునందు సైతము తారక చంద్రుని వెన్నడించును. చెట్టు నేల వ్రాలుచో దాని నాశ్రయించి యుండుతీఁగయు నేల వ్రాలును. ఏనుఁగు బురదలోఁ జిక్కుకొనినయపు డాఁడుఏనుఁగును జిక్కుకొనును. అట్లే యీమెయు నీవెంట రాఁదలఁచుచున్నది. సతి భర్తతోడిదే గదా!

సతి యెల్లప్పుడును భర్తతోడఁ గలసియే యుండు నని భావము.

6. ఎడమయడుగు పడయఁగా నిమ్ము న; న్నెడమడుగు వలదు—

ఈ వాక్యములు భాసమహాకవి రచించినప్రతిమానాటకమునందలి ప్రథమాంకములోనివి.

లక్ష్మణుని వచనములను విని శ్రీరామచంద్రుఁడు సీత తనవెంట నరణ్యభూములకు వచ్చుట కనుమతించును. ఇంతలో నొకచేటి రేవమ్మగారు క్రొత్తగాఁ బంపిననారచీరలను గొనివచ్చును. శ్రీరామచంద్రుఁ డాచేటి నడిగి యానారచీరలను గైకొని తాను ధరించును. అపుడు లక్ష్మణుఁడు 'అన్నా! నీవు దాల్చువస్త్రభూషణమాల్యాదివస్తువుల నెప్పుడును నీవు నాకు సగ మిచ్చుచుండెడివాఁడవు. ఇప్పుడుమాత్రము నా కీయకుండ వల్కలమును నీ వొక్కఁడవే ధరించితివి. ఇది యుక్తమా?' యని ప్రశ్నించును. అది విని శ్రీరామచంద్రుఁడు లక్ష్మణుఁడు కూడఁ దనవెంట నరణ్యములకు రాఁగోరుచున్నాఁ డని యెఱిఁగి యాతని వారింపు మని సీతతోఁ జెప్పును. సీత యాతని వారించును. అంత లక్ష్మణుఁ డామెకు సమాధానముఁ జెప్పుచు నీవాక్యములు పలికెను.

“తల్లీ! మాయన్నగారి పాదపద్మములను నీ వొక్కరితవే సేవింపఁ దలఁతువా? పోనిమ్ము. వారియడుగులలోఁ గుడియడుగు నీకే యగును గాక! ఎడమయడుగును నన్ను సేవింప నిమ్ము. నీవు దీని కెదురాడవలదు”—

ఎడమయడుగు = ఎడమపాదము; ఎడమడుగు = వెనుబాటు.

ఆంధ్రకరణములో నిటఁ జమత్కారము సాధింపఁబడినది.

7. మాఁడు నిటు లేలయా చేయఁ జూడవైతి.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి ద్వితీయాంకములోనిది.

శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యములకుఁ బోయిన పిదప వారి వనగమనవృత్తాంతమును విని దశరథుఁడు మిక్కిలి దుఃఖితుఁడై యనేకవిధముల వారిఁ బేర్కొని విలపింపసాగును. ఆ సందర్భమున నాతఁడు భగవంతు నుద్దేశించి పలికినవాక్యములలో నీవాక్యము కలదు.

'పరమేశ్వరా! గొడ్డుఁబోఁతుగా మ మ్మేల పుట్టింప వయితివి? ఇతరున కెవనికో కుమారునిగా శ్రీరామచంద్రునిఁ జేసియుండరాదా? కైకేయి నేయడవిలోనైనఁ బులిగాఁ బుట్టించియుండిన నెంత బాగుండెడిది? ఈ మూఁడు కార్యములును నీ వేల చేయ వయితివి?'

ఈ మూఁడును—ఆ మూఁడు నే వనఁగా దశరథుని గొడ్డుఁ బోఁతుగాఁ బుట్టించుట, యితరున కెవనికో శ్రీరామచంద్రునిఁ గుమారునిగాఁ జేయుట, కైకేయి నడవిలోఁ బులిగాఁ బుట్టించుట—యనునవి.

8. ముప్పులివి మూఁడు నే నెట్లు చెప్పఁగలను.

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి తృతీయాంకములోనిది.

భరతుఁడు చాలనాళ్లనుండి తన మేనమామగారియింట నుండుటచే నతనికి నయోధ్యలో జరగినపరిణామము లేవియుఁ దెలియవు. శ్రీరామచంద్రుని వనగమనానంతరము దశరథమహారాజు పుత్రశోకముచే స్వర్గస్థుడు కాఁగా సుమంత్రుఁడు మొదలగుప్రకృతిజనము కేకయదేశమున మేనమామగారియింట నుండుభరతునికి దశరథుఁ డస్వస్థశరీరుఁడుగా నుండుటచే నొకతూరి వచ్చి పొమ్మని కబురు చేయుదురు. అది విని భరతుఁడు రథారూఢుఁడై యయోధ్య కరుదెంచుచు మార్గమధ్యమున సూతునితోఁ దనతండ్రిగారి యస్వస్థతనుగూర్చి సంభాషించును. పిదప భరతుఁడు తా నయోధ్య చేరినపిదప బంధుజనసమాగమ మేరీతి నుండునో యూహించుకొను చుండఁగా నయోధ్యనుండి వచ్చిన యాసూతుఁ డుత్తరక్షణమున రిత్తవో మన్న యాశను మోచుచు భరతుఁ డయోధ్యను బ్రవేశించుచున్నాఁ డని వచించుచు నెఱిఁగి యుండియుఁ దాను దశరథుని మరణవృత్తాంతము నాతనికిఁ దెలుపకుండుటకుఁ గారణమును దెలుపుసందర్భమున నీవాక్యమును బలికెను.

'దశరథుని శరీరత్యాగము, తల్లి యగు కైక యైశ్వర్యలోభవృత్తాంతము, శ్రీరామచంద్రుని వనవాసము నను నీమూఁడు ముప్పులను నే నొక్కమాఱుగా నెట్లు చెప్పఁ గలను.' - ఒకటి చెప్పినచోఁ దక్కిన రెండునుగూడఁ దప్పనిసరిగాఁ జెప్పవలసి వచ్చును గనుకను, మూఁడు ముప్పుల నొక్కమాఱుగాఁ జెప్పినచో భరతుఁ డే మగునో యనియు సూతుఁ డెఱిఁగియుండియు దశరథుని మరణవృత్తాంతమును భరతునికిఁ దెలుపఁ డయ్యెను.

9. తల్లి చలువచేతితాఁకుడు సంతాప మార్చుచల్లనీటియంజలి గద—

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి తృతీయాంకములోనిది.

భరతుఁడు దేవకులికునివలనఁ దనతల్లి యగు కైక దుశ్చింతచే శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యముల వసింప నేఁగె ననియు, వారు చన్నపిదప దశరథుఁడు పుత్రశోకమును భరింపఁజాలక యసువులఁ బాసె ననియుఁ దెలిసి మోహ మందును. ఇంతలో నచటికిఁ బ్రతిమాగృహమున దశరథుని దర్శింపఁ దలఁచి యతనిరాణులు ముగ్గురును నరుదెంతురు. వారు వచ్చుచుండుటను జూచి దేవకులికుఁడు 'అన్నా! ఆశ్చర్యము! భరతుఁడు మూర్ఛఁ జెందియున్నాఁడు. సరిగా నీసమయముననే రాణులును నరుదెంచుట మంచి దయ్యెను' అని పలుకుచుఁ బయివాక్యమును బలికెను.

తల్లి తనచల్లనిచేతితోఁ గుమారుని స్పృశించినయెడల నదియే చల్లనినీరు చల్లినట్లు సేద దీర్చునుగదా! ఇచటఁ దల్లియొక్క చల్లని హస్తస్పర్శము మూర్ఛితుఁ డయినకుమారునికిఁ జల్లనీటి యంజలివంటి దని చెప్పఁబడినది.

అంజలి = దోసిలి; సంతాపము = దుఃఖము, వేఁడిమి.

**10.** కడుఁ బవిత్రము లగుగంగాయమునలకు నడుమ ముఱికికాల్వ నడచినట్లు.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి తృతీయాశ్వాసములోనిది.

భరతుఁడు ప్రతిమాగృహమున దేవకులికునివలన శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యములకుఁ బోయె ననియు, వారు పోయినపిదప దశరథుఁడు పుత్రశోకమును భరింపఁజాలక యసువులఁ బాసె ననియుఁ దెలిసికొని మూర్ఛఁ జెందును. అంతలో నచ్చటికిఁ బ్రతిమాస్థుఁ డయిన దశరథుని దర్శించుటకై యతనిరాణులు మువ్వురును నరుదెంతురు. కొంత తడవునకు భరతుఁడు మూర్ఛనుండి తేరుకొని యచ్చటకు వచ్చి యుండిన సుమంత్రునిఁ జూచి తన తల్లులకు నమస్కరింపఁ దలఁచి తన కభివాదన క్రమము నుపదేశింపు మని కోరును. అతఁ డుపదేశించినప్రకారము కౌసల్యకును, సుమిత్రకును నమస్కరించి, పిదప నాతఁడు కైకకు నమస్కరింపు మనఁగా సరోషముగా లేచి యామె ననేకవిధములఁ దూలనాడును. ఆసందర్భమున భరతుఁడు పలికినవాక్య మిది.

మిక్కిలి పవిత్రము లయినగంగానదికిని, యమునానదికిని నడుమ ముఱికికాలువ నడచినయెడల నెంత హేయముగా నుండునో నాతల్లు లగు కౌసల్యా సుమిత్రలనడుమ నీవు నిలిచి యుండుట నా కంత హేయముగాఁ దోఁచుచున్నది. ఇటఁ గైకేయి ముఱికికాల్వతోను, కౌసల్యాసుమిత్రలు గంగాయమునలతోను బోల్పఁబడిరి.

**11.** నే స్థాపింతుఁగా భువిఁ గ్రొత్తధర్మమును.........

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి తృతీయాంకములోనిది.

ప్రతిమాగృహమున భరతుఁడు మూర్ఛనుండి దేరుకొని యచ్చటికి వచ్చి యుండిన తన తల్లులు మువ్వరను గనుగొని వారికి నమస్కరింపఁ దలఁచును. తొలుత నాతఁడు సుమంత్రుఁ డుపదేశించిన యభివాదన

గ్రకమము ప్రకారము కౌసల్యాసుమిత్రల కిరువురకును నమస్కరించి యాతరువాతఁ గైకేయికి నమస్కరింపు మని సుమంత్రుఁడు చెప్పఁగా నాతఁడు సరోషుఁడై లేచి యామెను దూలనాడును. అప్పుడు కౌసల్య 'పెద్దలమర్యాదల నన్నిటిని బాటించునీవే మీతల్లి యగుకైకకు నమస్కరింపకుండుట న్యాయము కా' దని వచింపఁగా భరతుఁడు కైక తనకుఁ దల్లి కా దని వచించుచు నిట్లు పలుకును. 'పుత్రుఁడు పాపాత్ముఁ డయిన యెడల దండ్రి యాతనికి ఘటశ్రాద్ధముఁ జేసి యతనితోడి సంబంధమును దొలఁగించుకొనవచ్చు నని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. అట్లు చేసినవాఁ డపుత్రకుఁడే యగుచున్నాఁడు. నే నిపు డొక క్రొత్తధర్మమును భూమిపై స్థాపింపఁ దలఁచుచుంటిని. అది యేదనఁగా—నిజనాథుని నిక్కటులపాలుఁ జేసినతల్లికి మాతృత్వము తీరును - అనునది. తనతల్లి యగుకైక తనతండ్రి నిడుమలపాలుఁ జేయుటచే నామెకు మాతృత్వము తొలఁగి పోయిన దనియు, నందుచే నామె తనకుఁ దల్లియే కా దనియు, నట్టిధర్మ మింతకు మునుపు లేకున్నను నిప్పుడు తాను గ్రొత్తగా దానిని స్థాపింపఁ దలఁచు చుంటి ననియు భరతుఁడు పలుకుచున్నాఁడు.

12. అమ్మహాత్ముఁ డుండకుండ నే నయోధ్య యయోధ్య కాదెం దతండు గలఁ డదే యయోధ్య.

ఈ వాక్యములు భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి తృతీయాంకములోనివి.

ప్రతిమాగృహమున సుమంత్రుఁడు భరతునిఁ జూచి వసిష్ఠవామదేవులు ప్రకృతులతో నరుదెంచి యాతని కభిషేకము సేయఁ దలఁచి విజ్ఞాపించుకొనుచున్నా రని వచింపఁగా భరతుఁ డది విని ప్రకృతులను దనవెంట రమ్మని కోరును. సుమంత్రుఁ డభిషేకమును విడిచి నీ వెచటికిఁ బోయెద వనఁగాఁ దనతల్లి యగుకైకకే యా యభిషేకముఁ జేయవలసిన దని చెప్పి భరతుఁ డీవాక్యములు పలుకును.

"లక్ష్మణప్రియుఁ డగు శ్రీరామచంద్రుఁ డెచ్చట నుండెనో యచ్చటికి నేను బోవుచున్నాఁడను. ఆ మహాత్ముఁడు లేనియయోధ్య యయోధ్య కాదు. అతఁ డెచట నుండెనో యదే యయోధ్య."

ఈ పలుకులలో భరతునికి శ్రీరామచంద్రునియెడల నెంత భక్తి గలదో వెల్లడి యగుచున్నది. తనకు జరుగనున్న రాజ్యాభిషేకమును గూడఁ దిరస్కరించి యాతఁడు శ్రీరామచంద్రుఁ డున్నయెడకుఁ బోఁ దలఁచును. అది యరణ్య మయ్యును దనసోదరుఁ డందు వసించుచుండుటచే నదియే యయోధ్య యని యాతఁడు విశ్వసించును. శ్రీరామచంద్రుఁడు లేనియెడల నగర మయ్యును నయోధ్య యరణ్యమువంటిదే యని యాతని యభిప్రాయము.

13. విగ్రహము లందె నా వారు వెలయువారు.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి చతుర్థాంకములోనిది.

భరతుఁడు తనతల్లి యగుకైకేయియొక్క దుశ్చింతకు రోసి రాజ్యాభిషేకమును దిరస్కరించి శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి యాతనిఁ దిరిగి యయోధ్యకుఁ గొనితేవలయు నని సుమంత్రాదులతో నరణ్యముల కేఁగును. సీతారామలక్ష్మణులు నివసించుచున్న యాశ్రమప్రాంతముఁ జేరినపిదప భరతుఁడు శ్రీరామచంద్రుఁ డెక్కడ నున్నాఁడో తెలుపు మని సుమంత్రునిఁ బ్రార్థించును. అప్పుడు సుమంత్రుఁ డచటియాశ్రమపదమును జూపి యందాతఁడు గలఁ డని చెప్పుసందర్భమున నీవాక్యమును బలుకును.

సత్యము, శీలము, భక్తి యను మూఁడుగుణములును రూపు దాల్చెనా యనున ట్లున్న శ్రీరామచంద్రుఁడును, సీతాదేవియు, లక్ష్మణుఁడును నా యాశ్రమమునఁ గలరు చూడు మని సుమంత్రుఁడు భరతునితో ననును.

14. తమ్ముపయికూర్మి యిట్టివిధమున నుండెఁ

గన్నకడుపుపై కూర్మి యెక్కరణి దగునొ.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి చతుర్థాంకములోనిది.

భరతుఁడు శ్రీరామచంద్రుని యాశ్రమసమీపమున నిలిచి లోపలనున్న శ్రీరామచంద్రునికిఁ దనరాకనుగూర్చి బయటనుండియే విన్నవించును. పలుకుతీరునుబట్టి యావచ్చినవాఁడు బాంధవుఁడే యయి యుండు నని నిశ్చయించి శ్రీరామచంద్రుఁ డాతఁ డెవఁడో చూచి రమ్మని లక్ష్మణునిఁ బంపును. లక్ష్మణుఁ డాశ్రమమునుండి వెలికివచ్చి భరతునిఁ జూచి యాతని రాకను శ్రీరామచంద్రునికిఁ దెలుపును. శ్రీరామచంద్రుఁడును భరతుఁడు వచ్చినాఁ డని తెలిసికొని మిక్కిలి సంతోషించి యాతనిఁ జూచుటకై తనకన్నుదోయి నాయత్తపఱుచుకొను మని సీతకుఁ జెప్పి తానును నాతనిఁ జూచుటకుఁ దొందరపడుచు మైథిలితో నీవాక్యమును బలుకును.

"తోఁడఁబుట్టినవాఁ డగు తమ్మునిపైనే నా కింత ప్రేమము కలదు. ఆతని నెప్పుడు చూతునా యని నామనసు వేగిరపడుచున్నది. ఇట్టిచోఁ గన్నకడుపుమీఁది ప్రేమ మింకెట్లుండునో వేఱ చెప్పవలయునా ? అందుచే నేను జేయఁజాలనికార్యమును నాతండ్రి యగు దశరథుఁడు చేయఁగలిగె నని యిప్పుడిప్పుడే నేను తెలిసికొనఁ గలుగుచున్నాను."

**15.** నన్ను నీ చిరజీవిత్వము మేలు వోలె నిసిరో చెందించెఁ బెఱ దోషముల్.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి చతుర్థాంకములోనిది.

శ్రీరామచంద్రునిఁ బ్రార్థించి యాతని నెట్లైనను దిరిగి యయోధ్యకుఁ దీసికొని రావలయు నని తలఁచి భరతుఁడు సుమంత్రాదులతోఁ గలిసి సీతారామలక్ష్మణు లున్నయరణ్యములకుఁ బోవును. అచ్చట వారియాశ్రమముఁ జేరినపిదప దశరథుని మరణానంతరము సుమంత్రుఁడు శ్రీరామచంద్రుని మొట్టమొదటిసారిగాఁ జూచుట యదియే గనుక తొలుత భరతుని

లోనికిఁ బొమ్మని యూపిదపఁ దాను లోనికిఁ బోవును. శ్రీరామచంద్రుఁ డాతనిఁ జూచి తనతండ్రి యగుదశరథుఁడు జ్ఞాపకము రాఁగా మిక్కిలి దుఃఖించును. అంత సుమంత్రుఁడు మిక్కిలి దుఃఖముతో శ్రీరామ చంద్రునితో సంభాషించు సందర్భమునఁ దనకు దీర్ఘాయుస్సు గలుగుట గూడ దోషముగానే యున్న దని చెప్పుచు నీవాక్యమును బలికెను.

"దశరథుఁడు స్వర్గస్థుఁ డయ్యెను. నీవా యీ యరణ్యభూముల యందు నివసించుచుంటివి. ఇఁక భరతుఁ డందుమా మిక్కిలి దుఃఖా క్రాంతుఁడై యున్నాఁడు. కులమును బ్రాపేపులను గోలుపోయినది. ఈ విధముగా ననేకము లగుసంకటములకు నన్నుఁ బాలుపఱుచుచు నీ చిరం జీవిత్వము (చాలకాలము బ్రదికియుండుట) పయికి మేలువలెనే యగపడుచు ననేకదోషములను జెందించుచున్నది."—ముసలితనములోఁ దనకు సంబం ధించినవారి కెల్ల నిట్టికష్టములు ప్రాప్తించుటను దాను గన్నులారఁ జూడవలసి వచ్చినదిగదా యని సుమంత్రుఁడు పరితపించుచుఁ దన దీర్ఘాయుష్యము నీ వాక్యమున నిందించుచున్నాఁడు.

చిరజీవిత్వము = చాలకాలము బ్రదికియుండుట, పెద్ద దోషముల్ = గొప్ప దోషములు.

16. కొంచెపుఁ గాలముననె యా

ర్జించెన్ భరతుండు జగతి స్థిరతరయశముల్.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి చతుర్థాంకములోనిది.

శ్రీరామచంద్రునివెంట నాతనికి సేవ సేయుచు నరణ్యములలోనే యుండుట కనుమతింపవలసిన దని భరతుఁడు శ్రీరామచంద్రునిఁ బ్రార్థించును. కాని శ్రీరామచంద్రుఁడు పితృవాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చి యాతనికి సత్యవాక్య గౌరవము చేకూర్పవలసినబాధ్యత తమపై నున్న దని హెచ్చ రించును. మఱియు రాజ్యమును బరిపాలింపఁ బొమ్మని యాతని కాదేశించి

తనపై నొట్టుపెట్టుకొనెను. అంతఁ జేయునది లేక భరతుఁడు పదునాలుగు సంవత్సరములను గడచినపిదప శ్రీరామచంద్రుఁడే రాజ్యమును స్వీకరింప వలయునని ప్రార్థించి యాతఁ డందుల కంగీకరించినపిమ్మట నాతనిపాదుకల నిమ్మని యడుగును. వానిని సింహాసనముపై నుంచి వానికిఁ బ్రతినిధిగా నుండి తాను రాజ్యపాలనము గావింతు నని విన్నవించును. అది విని శ్రీరామచంద్రుఁడు భరతునియెడల మిక్కిలి సంతోషించి తనలో ని ట్లనుకొనును.

చాలకాలము పాటుపడి నే నేదో కొంచెము కీర్తిమాత్రమే సంపాదింపఁ గలిగితిని. భరతుఁ డిపుడు తన భక్తిమాధుర్యముచే నచిరకాలములోనే శాశ్వత మయినకీర్తిని సంపాదింపఁ గలిగెను.

పాదుకాపట్టాభిషేకము చేసి భరతుఁడు సుస్థిర మయినయశస్సును సంపాదించె ననుట తథ్యము.

**17.** నీడను దప్పుకొన్నవాఁడను శరీరము నే లంఘింప నంగీకరింతునా ?

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి పంచమాంకములోనిది.

సీతారాము లిరువురును నొకనాఁ డామఱునాఁడు జరగవలసిన యుండిన దశరథుని యనుసంవత్సరశ్రాద్ధమునుగూర్చి సంభాషించుకొనుచుండఁగా రావణుఁ డచటికిఁ బరివ్రాజకవేషముతో నరుదెంచును. అతనిఁ జూచి శ్రీరామచంద్రుఁడు స్వాగతము పలికి లోనికిఁ గొనిపోయి యాతని పాదములఁ గడుగుటకై పాద్యము తెమ్మని సీతతోఁ బలుకును. ఆమె తెచ్చిన పిదప రాముఁడాతని శుశ్రూషింపు మనఁగాఁ దనమాయ వెల్లడి యగు నేమో యని భయపడి రావణుఁ డామె యుత్తమపతివ్రత యనియు నామె తనకు శుశ్రూషించుట తగ దనియుఁ బలికి తప్పించుకొనును. శ్రీరామచంద్రుఁ డంతఁ దానే యాతని శుశ్రూషించుటకు సిద్ధపడఁగా రావణుఁడు శ్రీరామచంద్రునితో నీవాక్యమును బలికెను.

నీడను దాటవలసి వచ్చు నని ప్రక్కకుఁ దొలఁగి పోయినవాఁడను శరీరమునే లంఘింతునా ? సీతశుశ్రూషరయే వల దన్నవాఁడను నీశుశ్రూష యంగీకరింతునా యని భావము. సీత ఛాయ యగుచో శ్రీరామచంద్రుఁడు శరీరము.

**18.** తపసు చాలనిదైనను ధనువు గలదు; ధనువు చాలనిదైనను దపసు గలదు.

ఈవాక్యములు భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి పంచమాంకములోనివి.

సీతారాము లిరువురును నొకనాఁ డామఱునాఁడు జరుగవలసి యుండిన దశరథుని యనుసంవత్సరశ్రాద్ధమునుగూర్చి సంభాషించుకొను చుండిరి. ఆసమయమున నచటికి రావణుఁడు పరివ్రాజకవేషమున రాఁగా శ్రీరామచంద్రుఁ డాతని లోనికిఁ గొనిపోయి యతిథిసత్కారము గావించును. పిదప రావణుఁడు బ్రాహ్మణసముదాచారము ననుష్ఠించుచుఁ దా నధ్యయనము చేసినశాస్త్రములఁ బేర్కొని శ్రాద్ధకల్పమునుగూడఁ దా నధ్యయనము చేసినట్లు తెలుపును. అపుడు శ్రీరామచంద్రుఁడు శ్రాద్ధకల్పముపై నాస్థ చూపుచు మఱునాఁడు తనతండ్రిగారి ప్రత్యాబ్దిక మని తెలిపి పిండప్రదాన కాలమునందుఁ బితరులు దేనితోఁ దృప్తిఁ బొందుదు రని యాతని నడుగును. రావణుఁడు కొన్నివస్తువులను బేర్కొని 'యయినను' అనును. అది యేదో తెలుపవలసిన దని శ్రీరాముఁ డడుగఁగా నది ప్రభావసంపాద్య మని రావణుఁడు వచించును. అప్పుడు శ్రీరామచంద్రుఁడు పయివాక్యములను బలికెను. 'నాకడ నుభయమును సన్నిధానమై యున్నది. దాని సాధించుటకుఁ దపస్సు చాలని దగుచో ధనువున్నది. ధనువు చాలక పోయినచో దపస్సు కలదు'.

తపస్సును ధారవోసి యయినను, ధనుర్విద్యానైపుణ్యముఁ జూపి యయినను నావస్తువును దెచ్చి పిండప్రదాన కాలమునందుఁ బితరులను దృప్తిపఱుతు ననుటచే శ్రీరాముని పితృభక్తితత్పరత యెట్టిదో వ్యక్త మగుచున్నది.

**19. బెబ్బులిని జింకపిల్ల లదల్పఁగలవె.**

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి పంచమాంకములోనిది.

శ్రీరామచంద్రుఁడు కాంచనపార్శ్వమృగమును దెచ్చుటకై యాశ్రమము వీడి చనఁగాఁ బరివ్రాజకవేషమున నున్నరావణుఁడు స్వస్వరూపముఁ డాల్చి సీతయెదుట నిలుచును. సీత యాతనిఁ జూచి భయపడి 'కాపాడండి, కాపాడండి' యని కేకలు వేయును. అప్పుడు రావణుఁడు సీతతో 'రామలక్ష్మణ దశరథులలో నీ వెవరినైనను శరణు వేఁడుము. అల్పమనుజులయినవారు న న్నేమియుఁ జేయఁ జాల' రనుచు నీవాక్యమును బలికెను.

బెబ్బులిని జింకపిల్ల లదల్పఁగలవా? అదల్పలే వనుట. అట్లే సీత శరణు వేఁడుచున్న రామలక్ష్మణదశరథులలో నెవరును ద న్నేమియుఁ జేయఁ జాల రని రావణుఁడు సీతతోఁ బలికెను.

**20. నకా గుణమట్లు దోఁచియుఁ జిరాయుష్యంబు బాధించెడుక.**

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమా నాటకమునందలి షష్ఠాంకములోనిది.

జనస్థానమున నివసించుచుండిన సీతారామలక్ష్మణుల యోగక్షేమముల నరసి రమ్మని భరతుఁడు సుమంత్రునిఁ బంపును. అతఁ డచటికిఁ బోయి చూడఁగా నచ్చట నెవ్వరును లే రయిరి. రావణుఁడు సీత నపహరించుకొని పోయె ననియు, నామెను వెదకుకొనుచు శ్రీరామలక్ష్మణులాచోటు వీడిపోయి రనియు నచటివారు చెప్పఁగా విని సుమంత్రుఁడు మిక్కిలి దుఃఖించుచు నయోధ్యకు మరలి వచ్చెను. అయోధ్యలో భరతుని దర్శించి యాతని కావిషయముఁ జెప్పఁబోవుచు సుమంత్రుఁడు కాంచన తోరణద్వారమున నిలిచి 'దశరథుని మరణసమయమున నే నుంటిని. రామలక్ష్మణుల వనవాసగమనమును గన్నులారఁ గంటిని. నేఁడు సీతాపహరణ వృత్తాంతమును వింటిని' అని తలపోయుచుఁ దన దీర్ఘాయుష్యమును నిందించుకొనుసందర్భమున నతఁడు పయివాక్యమును బలికెను.

గుణమువలెఁ బయికిఁ గనఁబడుచున్నను దీర్ఘాయుష్యము నన్ను మిక్కిలి బాధించుచున్నది.

దీర్ఘాయుష్య మున్నందువలననే తనకు సంబంధించినవారికి వచ్చు కష్టముల నన్నిటిని జూడవలసివచ్చుచుండె నని సుమంత్రుని యభిప్రాయము.

21. కావఁబడెఁ దుల్యదుఃఖుఁడు గాన యతఁడు.

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి షష్ఠాంకములోనిది.

జనస్థానమున వసించుచుండిన సీతారామలక్ష్మణుల యోగక్షేమముల నరసి రమ్మని భరతుఁడు సుమంత్రునిఁ బంపఁగా నాతఁ డచ్చటికిఁ బోయి సీత యపహరింపఁబడిన దనియు, నామెను వెదకుకొనుచు రామలక్ష్మణు లాప్రదేశము వీడిపోయి రనియు, నట్లు పోయి వారు కిష్కింధను జేరి రనియుఁ దెలిసికొని దుఃఖితుఁడై యయోధ్యకు మరలి వచ్చును. అయోధ్యలో నాతఁడు భరతుని దర్శించి యాతనికి సీతాపహార వృత్తాంతమును దెలుపుటకు సంకోచించి యా విషయమును మఱుగుపఱుపఁ దలఁచును. సుమంత్రుఁడు సీతారామలక్ష్మణులు జనస్థానము లే రనియుఁ, గిష్కింధకు వెడలి రని తెలియవచ్చె ననియు, నచ్చటివానరు లుపకార మెఱిఁగి వర్తింతు రనియుఁ జెప్పఁగా భరతుఁడు శ్రీరామచంద్రుఁడు వారి కెట్టి యుపకారమును గావించెనో తెలిసికొనఁ గోరును. అపుడు సుమంత్రుఁడు వాలి తన తమ్ముఁ డగుసుగ్రీవుని రాజ్యమునుండి వెడలఁగొట్టె ననియు, భార్యను గోల్పోయి యాతఁడు ఋశ్యమూకపర్వతముపై వసించుచుండె ననియుఁ జెప్పి సుగ్రీవుఁడు తుల్యదుఃఖుఁ డగుటచే నాతని శ్రీరామచంద్రుఁడు కాపాడె నని పలుకును.

సుగ్రీవుఁడును దనవలెనే భార్యను గోల్పోయి తుల్యదుఃఖుఁ డగుటచే నాతనియెడ జాలిగొని శ్రీరామచంద్రుఁ డాతని రక్షించె నని భావము.

సుమంత్రుఁడు నోరు జారి 'తుల్యదుఃఖుఁడు' అన్న యీ మాటను బట్టుకొని భరతుఁడు 'తుల్యదుఃఖుఁ డంటిరే! అది యెట్టిది?' యనును. సుమంత్రుఁడు సీతాపహారవృత్తాంతమును జెప్పక తప్ప దయ్యెను.

22. కలిగెఁ గాంతాపహరణసంకటము గూఢ —

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమా నాటకమునందలి షష్ఠాంకములోనిది.

జనస్థానమునుండి మరలి వచ్చిన సుమంత్రుఁడు సీతాపహార వృత్తాంతమును దెలుపఁగా భరతుఁడు మిక్కిలి పరితపించి దీని కంతకు మూల కారకురా లయినకైకేయిని నిందించుటకై యామె యంతఃపురమునకుఁ బోవును. కైకేయిని జూచి భరతుఁడు 'నీయనుజ్ఞచేఁ దనరాజ్యము వీడి యడవులకుఁ జన్న శ్రీరామచంద్రునిభార్య యగుసీతాదేవి యపహరింపఁబడె నఁట! నీమనోరథము నిండారినదా?' యనును. ఆమె యది విని నిర్విణ్ణురా లగును. అంత భరతుఁడు 'సత్త్వమహితు లయినయిక్ష్వాకువంశరాజులకు నీవు కోడలవుగా దాపురించుటచేఁ గాంతాపహరణసంకటముకూడఁ గలిగె' నని యామెను నిందించును. కైకవంటి దుర్మార్గురాలు కోడ లగుటచే సత్త్వమహితు లయినయిక్ష్వాకువంశ్యులకు భార్యాపహరణకష్టము ప్రాప్తించిన దని భరతుని యభిప్రాయము.

23. ఓయి! నాకుఁ బోలె నును రుడుగును గాక

నీకుఁ గూడఁ బుత్త్రశోకముననె—

ఈ వాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమా నాటకమునందలి షష్ఠాంకములోనిది.

జనస్థానమునుండి మరలి వచ్చినసుమంత్రుఁ డయోధ్యలో భరతుని దర్శించి యాతనికి సీతాపహరణవృత్తాంతమును దెలుపును. అది విని భరతుఁడు మిక్కిలి దుఃఖాక్రాంతుఁడై యీ దుస్థితి కంతకును మూల కారకురా లయిన తనతల్లి యగుకైకను నిందింపఁ దలఁచి యామె యంతః

పురమునకుఁ బోవును. అచ్చట నామెను జూచి భరతుఁ డామె ననేక విధములఁ దూలనాడును. అప్పుడు కైక తాను దశరథు నట్లు వరములు కోరుటకుఁ గలకారణమును దెలుపుట కదియే మంచిసమయ మని తలపోసి దశరథునికిఁ గల శాపమును దెలియఁజెప్పు మని సుమంత్రునిఁ గోరును. సుమంత్రుఁడు దశరథునికిఁ గల మహర్షి శాపవృత్తాంతమును దెలుపుచు మహర్షి దశరథు నిట్లు శపించె నని యీవాక్యములు పలుకును.

నా వలెనే నీవును బుత్త్రశోకముచే మరణింతువు గాక! యని శాపము.

24. కన్నతల్లి యెవతె నాయనా బిడ్డతప్పును మన్నించకుండా వుంటేది.

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి షష్ఠాంకములోనిది.

జనస్థానమునుండి మరలి వచ్చినసుమంత్రుఁ డయోధ్యలో భరతుని దర్శించి యాతనికి సీతాపహారవృత్తాంతమును దెలుపును. అది విని భరతుఁడు మిక్కిలి దుఃఖితుఁడై యీ యాపదకు మూలకారకురా లయినతనతల్లి యగుకైకను నిందింపఁదలఁచి యామె యంతఃపురమునకుఁ బోవును. అచ్చట నామెను జూచి యామె ననేకవిధములఁ దూలనాడఁగా నామె తాను నిర్దోషురా లనియు, దశరథునికిఁ గల మహర్షి శాపమును నిర్వర్తింపఁ జేయుటకే తా నారీతిని దశరథుని వరములఁ గోరవలసివచ్చె ననియు, నా బెడదలోఁ బదునాలుగునాళ్లనఁబోయి నోరు జార పదునాలుగేళ్లని యనె ననియు, నా విషయము గురుజనమునకును జక్కఁగాఁ దెలియు ననియుఁ జెప్పఁగా భరతుఁడు తనతల్లి నిర్దోషురా లని యెఱిఁగి యామె ననవసరముగా దూషించినందులకుఁ బశ్చాత్తాపము నొంది యామె పాదములపైఁ బడి తన్ను క్షమింపవలసిన దని వేఁడుకొనును. అప్పుడు కైక భరతునితో నీవాక్యమును బలుకును.

ఏ కన్నతల్లియుఁ దనబిడ్డ చేసినతప్పును మన్నింపకుండ నుండదు.

25. మిట్టను బల్లముగాను బల్లమును మిట్టనుగాను జేయుచుండును గదా కాలము.

ఈవాక్యము భాసమహాకవి రచించిన ప్రతిమానాటకమునందలి సప్తమాంకములోనిది.

రావణవధానంతరము శ్రీరామచంద్రుఁడు లంకనుండి తన పరివారముతో నయోధ్యాభిముఖుఁడై పుష్పకవిమానమున వచ్చుచు మార్గమధ్యమునఁ దాము పూర్వము నివసించుచుండిన జనస్థానమునందలి మహర్షుల దర్శింపఁదలఁచి యచ్చట విడిసెను. అచ్చట శ్రీరామచంద్రుఁడు సీత కది తాము నివసించుచుండిన జనస్థాన మని తెలిపి యక్కడ నామె తనబిడ్డలవలెఁ బెంచుచుండినయాశ్రమవృక్షములను జ్ఞప్తికిఁ దెచ్చెను. సీతయు వానిని గుర్తించి పూర్వ మాకుల నందుకొని క్రిందికిఁ జూడఁదగియుండిన గున్నమొక్కలిప్పు డాకు లందక తల పైకెత్తి చూడవలసినవయ్యె ననును. అప్పుడు శ్రీరామచంద్రుఁడు సీతతో నీవాక్యమును బలికెను.

'కాలము మిట్టను బల్లముగాను, బల్లమును మిట్టనుగాను జేయుచుండును.'

కాలము గడచి పెద్ద పెరుఁగుటచేత నంతకుఁ బూర్వము చిన్న మొక్కలుగా నుండినవప్పుడు గొప్పవృక్షము లయ్యె నని శ్రీరామచంద్రుఁడు సీతకుఁ దెలుపును. కాలముచే నామొక్కలస్థితి మాఱినట్లే తమస్థితికూడ మాఱిన దనియుఁ దమకష్టములు తీరిన వనియు శ్రీరామచంద్రుఁ డీవాక్యముచే సీతకు సూచించుచున్నాఁడు.

—:♦:—

# ప్రశ్నలు

1. ప్రతిమానాటక మనుపేరు మీనాటకమున కెట్లు తగియున్నదో నిరూపించునది.
2. మీనాటకమునందలి వల్కలకల్పనమును సంగ్రహముగా వ్రాసి దానివలని ప్రయోజనమును విశదీకరించునది.
3. మీనాటకమునఁ దృతీయాంకమునకుఁ గల ప్రాధాన్యమును వివరించునది.
4. భాసుఁడు మీనాటకమునందలి తృతీయాంకమునఁ గావించిన ప్రతిమాగృహకల్పనమును సంగ్రహముగా వ్రాసి దానివలని ప్రయోజనము నెన్నునది.
5. రామభరతుల సమాగమమును సంగ్రహముగా నభివర్ణించునది.
6. దశరథశ్రాద్ధకల్పనమును సంగ్రహముగాఁ దెలిపి దానివలన నాటకమునం దెట్టి ప్రయోజనము సాధింపఁబడినదో విశదీకరించునది.
7. భాసుఁడు కైకపాత్ర కుదాత్తత గల్పించినవిధమును సంగ్రహముగా వ్రాయునది.
8. ప్రతిమానాటకమునుబట్టి యీక్రిందివారి గుణశీలములఁ జర్చించునది.

   1. శ్రీరామచంద్రుఁడు 2. భరతుఁడు 3. సీత 4. లక్ష్మణుఁడు.

9. భరతలక్ష్మణుల గుణశీలతారతమ్యముల నెన్నునది.
10. మీనాటకమునుబట్టి భాసుని ప్రతిభావిశేషముల (Merits of Bhasa as a dramatist) నెన్నునది.
11. మీనాటకమునందలి ప్రధానకల్పనములను మూఁడింటిని గైకొని వానివలని ప్రయోజనములను విశదీకరించునది.
12. నాంది-విష్కంభము-ప్రవేశకము-వీని లక్షణములను దెలిపి మీనాటకమునందవి యెంతవఱకు సరిపడుచున్నవో విశదీకరించునది.
13. దశరథుని మరణవృత్తాంతమును భరతునికిఁ దెలియఁజేయుట - సీతాపహరణవృత్తాంతమును భరతునికిఁ దెలుపుట - యీరెండు కార్యములును మీనాటకమున నెట్లు నిర్వహింపఁబడినవో విశదీకరించునది.
14. భాసునికిఁ బాత్రచిత్రణమునందుఁ గలసామర్థ్యమును వెల్లడించునది.
15. మీనాటకమును బట్టి భాసునికాలమునాఁటి సాంఘికరాజకీయ పరిస్థితులను విశదీకరించునది.